కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-53 సెప్టెంబరు2012

**మూలం: http://kottapalli.in/2012/09/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'ప్రకృతి':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల:రూ.20/-**

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

**ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in**




# విషయ సూచిక

# బోసాన్

సైన్సు మాస్టారు రామం గారంటే అందరికీ చాలా ఇష్టం. అందర్నీ తరగతి గదిలోంచి బయటకు తీసుకెళ్తారుగా, అందుకు.

ఆ రోజు శనివారం. అందర్నీ దగ్గర్లో ఉన్న కొండ ఎక్కిస్తున్నారు రామంసార్.

"చూశారా, పిల్లలూ? మనం 'చాలా పెద్దవి ' అనుకునే ప్రతి వస్తువునీ ముక్కలు చేస్తూ పోవచ్చు. ఇదిగో, యీ చాక్‌పీసును ముక్కలు చెయ్యొచ్చు, యీ పుల్లను ముక్కలు చెయ్యొచ్చు..." చేసి చూపించారు.

"అవును సార్, శ్రమ పడితే దేన్ని అయినా ముక్కలు చెయ్యొచ్చు".

"అదే, ఎంత చిన్న ముక్కలు చెయ్యొచ్చు? ఈ చాక్‌పీసును ఎంత చిన్నముక్కలు చేయొచ్చు?"

ఓ పిల్లాడు చాలా చిన్న ముక్కనొక దాన్ని చూపించాడు.

"ఇంకా చిన్నవి చెయ్యలేమా?"

చెయ్యొచ్చుసార్! కణాలుగా కూడా చెయ్యొచ్చు, చాక్‌పీసును నేల మీద రాకితే పొడి వస్తుందే, అందులో ఉండేవన్నీ చిన్న చిన్న కణాలే గదా" అన్నాడు సోము అనుమానంగా.

రామం సార్ నవ్వాడు. "అవును. దుమ్ములాగా ఉండే దానిలో కూడా కణాలున్నాయి. కంటికి కనబడతై అవి. అయితే వాటిని ఇంకా ఇంకా చిన్న ముక్కలు చేస్తూ పోవచ్చు. ప్రయోగశాలల్లో శాస్త్రవేత్తలు చేశారు ఆపని-"

"ఎంత చిన్న ముక్కలైనై?"

"కంటికి కనబడనంత చిన్నవి - వాటినే 'అణువులు - పరమాణువులు- atoms అన్నారు".

"వాటితో బాంబులు చేస్తారు కదండి సార్, నాకు తెలుసు ఆటంబాంబు" అన్నది లక్ష్మి.

రామం సార్ నవ్వి, కొనసాగించారు-

"ప్రతి అణువులోనూ చూస్తే - మధ్యలో గుండ్రంగా ఏదో ఉంది, దాని చుట్టూ మైక్రోస్కోపుకి కూడా తెలీనివి, ఏవో తిరుగుతున్నట్లనిపించాయి". అవి ఏంటో ఇంకా బాగా చూడకుండానే పేర్లుపెట్టారు: మధ్యలో దాన్ని "కేంద్రకం (న్యూక్లియస్)" అనీ, చుట్టూ తిరుగుతున్న వాటిని 'ఎలక్ట్రానులు' అనీ అన్నారు.

ఎలక్ట్రానులు ఎంత చిన్నవంటే, ఇప్పటి వరకూ వాటిని చూపెట్టే మైక్రోస్కోపే తయారు అవ్వలేదు!

అయితే న్యూక్లియస్‌ని మాత్రం చూశారు. అందులో ప్రోటాన్లు, న్యూట్రాన్లు వేరు వేరుగా ఉన్నాయని కనుక్కున్నారు. వాటి సంఖ్య మారిన కొద్దీ పదార్థం మారుతుంది. బంగారం అణువు కేంద్రకంలో ఎప్పుడూ 79 ప్రోటాన్లుంటై. ఇనుము అణువు కేంద్రకంలో ఎప్పుడూ 26 ప్రోటాన్లుంటై.. రాగి కేంద్రకంలో 29 ప్రోటాన్లుంటై.. అట్లా అన్నమాట".

"బాగుంది, అయితే ఓ యాభై ప్రోటాన్లు తీసుకొని రాగికి కలిపితే బంగారం తయారౌతుందన్న మాట!" సుమలత అన్నది హుషారుగా.

రామం సార్ నవ్వారు, "బాగానే అర్థమైంది నీకు, కానీ అదంత సులభంగా లేదు. ప్రోటాన్లు అణువుల్ని ఎంత గట్టిగా పట్టుకొని ఉన్నాయంటే - చెప్పలేనంత గట్టిగా! అవన్నీ కలిసి మనం కొత్తగా చేర్చబోయే ప్రోటాన్లను ఎంత తీవ్రంగా వ్యతిరేకిస్తాయంటే, ఆ పనిని బలవంతంగా చెయ్యాలంటే ఆటంబాంబంత శక్తి కావల్సి ఉంటుంది!"

"అయితే ఎలాగ?" అడిగాడు శేఖర్.

"ఏముంది, ఎలాగూ లేదు! పోయిన నెలలో పేపర్లో చూశారా, శాస్త్రవేత్తలు పరమాణువులో ఇంకో చిన్న ముక్క "బోసాన్"ని కనుక్కున్నారు! దేనికైనా 'బరువు' అంటూ రావాలంటే అది యీ

బోసాన్ల వల్లనేనట! అంటే బోసాన్లని తీసేస్తే బరువు లేని పదార్థం రెడీ!"

పిల్లలంతా అర్థంకానట్లు మొహంపెట్టారు.

అయితే ఆ సరికే అందరూ కొండ పైకి చేరుకునేశారు. "ఇప్పుడు మనం వంద అడుగులు ఎక్కివచ్చాం!" అన్నారు రామం సార్. పిల్లలు ఎవ్వరూ మాట్లాడలేదు- అందరూ నోళ్లు వెళ్లబెట్టి చూస్తున్నారు: కొండకు అవతలి వైపున, లోయ చుట్టూతా- విశాలంగా విస్తరించిన ఆకాశం! దూరంగా అంతే స్పష్టంగా నిలబడి ఉన్న కొండల వరుసలు! రివ్వు రివ్వుమని వీస్తున్న గాలి! ఆ గాలికి ఎగిరిపోకుండా ఒకరి చెయ్యి ఒకరు పట్టుకొని నిలబడ్డారందరూ. అన్ని గలగలలు కిలకిలల మధ్య- ఒక్కసారిగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది. ఎవరికి వాళ్లు మౌనంగా తమ మనసు లోతుల్ని స్పృశించారు.

కొద్ది సేపటి తర్వాత... మెల్లగా అన్నది సుమలత- "... క్రింద చూశారా సార్, మన 'ఎక్స్ ప్రెస్ వే' ఎంత సన్నగా, తీగలాగా ఉందో! మనుషులు తయారు చేసిన జీపులు, కార్లు, ట్రక్కులు అన్నీ చీమల్లాగా పోతున్నాయి! ఎదురుగా యీ కొండలు చూడండి మరి - ఎంత పెద్దగా నిలబడి ఉన్నాయో, అస్సలు కదల కుండా!".

"నిజమే.. మనుషులు ఎంత చేసినా, ఏవి -ఎన్ని- కనుక్కున్నా, వాటన్నిటికీ స్థానం కల్పించిన యీ ప్రకృతి శక్తి ముందు అది పిసరంతే!" తనలోతాను గొణుక్కున్నారు రామం గారు- ఆ సన్నివేశపు లోతునూ, ఆ కొండల పెద్దరికాన్నీ చూసి అసంకల్పితంగా మూగవోతూ.

ప్రకృతిని పిల్లలకు దగ్గర చేస్తున్న గురువులందరికీ నమస్కారాలతో,

కొత్తపల్లి బృందం




# నీతి చంద్రిక

విగ్రహం-10

*జరిగిన కథ: నెమలి రాజుతో పోట్లాట తీసుకొచ్చిన కొంగ(దీర్ఘముఖుడు) అటు వెళ్ళగానే, దాన్ని తప్పు పట్టటం మొదలు పెట్టింది ఒక చక్రవాక మంత్రి. హంసరాజు దాన్ని వారించి, 'ఇప్పుడు ఏం చెయ్యాలో దాన్ని గురించి మాట్లాడ'మంటాడు. అప్పుడు చక్రవాకం ఇలా అన్నది.. చదవండి- ఇదిగో, నీతిచంద్రిక 34 వభాగం.*

"రంగునుండి, ఆకారం నుండి, జవాబు ఇచ్చే తీరునుండి, కంటి చూపు నుండి, శరీరపు కదలికల నుండి- వీటన్నిటి నుండీ అవతలి వాళ్ళ మనసులో ఏం జరుగుతున్నదో తెలుసుకోగల సమర్థత ఉంటుంది, తెలివైనవాళ్లకు. అందువల్ల రాజ్య రక్షణ కోసం తెలివైన మంత్రులను సంప్రతించటం తప్పనిసరి. రాజుగారి నమ్మకానికి పాత్రులైన మంత్రులకు కోరిన కోరికలన్నీ తీరుతాయి, దేన్ని అయినా సాధించగల నేర్పు అలవడుతుంది.." అంటూ చక్రవాకం అటూ ఇటూ చూసింది.

వెంటనే రాజుగారికి అర్థమైంది- 'చక్రవాకం తనకు మాత్రమే ఏదో చెప్పనెంచింది' అని.

ఏకాంతం కోసం ఆ హంసరాజు అటూ ఇటూ చూసే సరికి, ఆ చూపులను అర్థం చేసుకొని సభలోని గౌరవనీయులు, వారి వెంబడి మిగతా సదస్యులు- అందరూ దూరంగా వెళ్ళారు.



అప్పుడు చక్రవాక మంత్రి రాజుకు మరింత దగ్గరగా జరిగి, ఆయన ముఖంపైనే చూపును నిలిపి, "ప్రభూ! వినండి- 'ప్రస్తుతానికి మన ఆ శత్రువు దగ్గరికి ఎవరైనా గూఢచారిని ఒకడిని పంపించటం మంచిది' అని నాకు తోస్తున్నది. పలు రకాలుగా ఆలోచించకుండా తొందరపడి ఏదో ఒకటి చెయ్యటం కార్యజ్ఞుల లక్షణం కాదు. 'ఆలస్యం చెయ్యకుండా నిర్ణయం తీసుకో-గలగటం వైద్య వృత్తిలోని వారికి ఎంత అవసరమో, తొందర పడకుండా ఆలోచించి నిర్ణయం తీసుకోవటం రాజులకు అంత అవసరం' అని పెద్దలు చెబుతారు. కొన్ని కొన్ని సార్లు ఏవో చిన్న పనులు త్వరపడి నిర్ణయించటం వల్ల నెరవేరవచ్చేమో గాని, మహా కార్యాలు మటుకు అలా త్వరపడితే జరగవు. బాగా ఆలోచించి చేసిన పనికి దైవం కూడా అనుకూలిస్తుంది.

అంతే కాదు- శత్రువు మనసులో ఏమున్నదో సరిగా తెలీనప్పుడు, త్వరపడి ఏదో సాహస కార్యంలోకి దిగటం అంత మంచిపని కాదు. భూమికి రాజైనవాడు తన లోటుపాట్లు బయటపడకుండా కాపాడుకుంటూ, శత్రు పక్షపు లోటు పాట్లను ముందుగానే జాగ్రత్తగా గూఢచారుల సహాయంతో తెలుసుకొనాలి.

ఇప్పుడు మనవైపునుండి వెళ్ళే గూఢచారి-తోబాటు వేరొకరిని కూడా పంపించాలి: దీనికోసం అదను ఎరిగి, ఉపాయం తెలిసిన విశ్వాస పాత్రులను ఎవరినైనా ఎంపిక చేసుకోవాలి.

అతడు ఎల్లప్పుడూ అప్రమత్తుడై మెలగుతూ, విరోధి ఇంటిలో జరిగే సంగతులన్నిటినీ ఎప్పటికప్పుడు మన చెవుల్లో వేస్తూ ఉండాలి.



ఇంతటి గొప్ప కార్యాన్ని నెరవేర్చటం దీర్ఘముఖుని వల్లనే అవుతుంది. అతడు నీళ్ళలోను, గాలిలో కూడాను సంచరించ-గలడు; ఇతరుల మనస్సులో ఏమున్నదో తెలుసుకోగల సమర్థత ఉన్నవాడతను. ఎన్ని రకాలుగా చూసినా ఈ పనిలో అతనికి సాటి రాగలవారు మరెవరూ ఈ సభలో కనబడటంలేదు నాకు. ఈ పనిలో అతనికి తోడుగా అతని తమ్ముడు ధవళాంగుడిని పంపుదాం. అతనికి కూడా ఇతరుల ఉద్దేశాలను తెలుసుకోవటం బాగా వచ్చు.

ఇతరులకు తెలియకుండా దీన్నంతా రహస్యం-గా నిర్వర్తించటం మంచిది. 'ఎట్లాగైతే పిడుగు అకస్మాత్తుగా వచ్చి మీద పడుతుందో, రాజుగారి ఆజ్ఞ కూడా అట్లా చివరి క్షణంలోనే అందాలి' అని చెబుతారు.

రాజుగారి మర్మం ఏమిటో ఎన్నడూ బయట పడకూడదు: ఒకవైపున ఆత్మరక్షణ ఎలా చేసుకుంటూ ఉండాలో, అలాగే మరొకవైపున రాజుగారి మనసులోని వ్యూహాన్ని కూడా బయటపడకుండా అలాగే కాపాడుకుంటూ పోవాలి. 'వ్యూహం మూడవనోట పడింది' అంటే ఇక పనులన్నీ నాశనమైనట్లే.

ఇదంతా తెలిసిన రాజు 'తాను-తన మంత్రి' అన్నట్లు ఉండి, ఎంతవారికీ అర్థం కానట్లు తన నిర్ణయాలను ఎప్పటికప్పుడు వెలువరించు-కుంటూ రావాలి. అదే విజయానికి మూలం అవుతుంది. 'రాజుగారు ఏమారారు' అంటే ఇక రహస్యం బట్టబయలౌతుంది. అట్లా 'వ్యూహం బయల్పడటం వల్ల ఎదురయ్యే

చిక్కులు తొలగటం చాలా కష్టం' అని పెద్దలు చెబుతుంటారు. నాకు తోచినంత వరకు తమరికి సర్వం విన్నవించాను. తమరు సర్వజ్ఞులు. తమకు తెలియని ధర్మాలు ఈ లోకంలో లేనేలేవు. ఇక తమరి ఆనతి ఎలా ఉంటే అలా నడచుకుంటాను" అన్నది.



అప్పుడు ఆ హంసరాజు కరుణ,చిరునవ్వులు ఒలికే చక్కని అందమైన ముఖంతో దాన్ని చూస్తూ "బాపురే! నువ్వు నా మనసులో ఏమున్నదో దాన్ని చదివినట్లే చెప్పావే! నీకు వంద సంవత్సరాలు! నీ మాటలు విని నాకెంతో సంతోషం కలిగింది. నువ్వు చెప్పినదానిలో కాదనేందుకు ఏమీ లేదు. మనం పంపించేందుకు గూఢచారికూడా మంచివాడే దొరికాడు. తప్పుని సరిగా చేయాల్సిన పనికి ఆలస్యం ఎందుకు? వెంటనే అమలు చేయండి" అన్నది.

అప్పుడు ఆ మంత్రి సవినయంగా "ప్రభూ! ఇలా 'మన ప్రయత్నం ఏమాత్రం లేకుండానే పనికి తగిన చారుడు దొరకటం' అనేది చాలా శుభ సూచకంగా తోస్తున్నది నాకు. 'భవిష్యత్తులో మనదే విజయం' అనేందుకిది సూచన కావచ్చును. సంకల్పంతోటే విజయాన్ని సాధించగల సమర్థులు మీరు" అని హంసరాజును మెచ్చుకున్నది.

సరిగ్గా ఆ సమయానికే కావలివాడొకడు లోనికి ప్రవేశించి- "ప్రభూ! జంబూద్వీపం నుండి ఎవరో- ఒక చిలుక అట, వచ్చి తమ దర్శనం కోసం వాకిట నిలబడి ఉన్నది. తమరి సెలవైతే దాన్ని లోనికి పంపమంటారా?" అని అడిగాడు.

ప్రభువులవారు మంత్రిగారి వైపు చూశారు. చక్రవాక మంత్రి ఆ చూపుల ఆంతర్యాన్ని

పసిగట్టి "నువ్వు ఇప్పుడు ఆ చిలుకను తగిన చోట కూర్చోబెట్టు. ప్రభువులవారి ఆజ్ఞ అయినప్పుడు దాన్ని లోనికి ప్రవేశపెడుదువు. ఇక పో!" అని త్రిప్పి పంపింది.



అప్పుడా కావలివాడు భయభక్తులు కదలాడ-గా వెళ్ళి, బయట ఉన్న చిలుకతో "ప్రస్తుతం మా ప్రభువులవారు మంత్రి వర్యులతో ఏకాంతంగా మంత్రాలోచన చేస్తున్నారు. వారి సమావేశం ముగిసాక, వారే స్వయంగా పిలువనంపుతామన్నారు. అప్పుడు నువ్వు వెళ్ళి వారి పాదాల దర్శనం చేసుకుందువు- అప్పటివరకూ ఇక్కడ విశ్రమించు" అని దానికి తగిన ఆసనం ఒకటి చూపించింది.

సభాగృహంలో హంసరాజు ఉల్లాసంగా మంత్రికేసి చూసి, "ఆహా! మంచి సైనికులకు సంతోషాన్ని, పిరికివాళ్లకు భయాన్నీ కలుగజేసే యుద్ధం ఇక దగ్గరపడింది. యుద్ధంలో వెనుకంజవేయని మహాయోధులకు తమ శరీరాలను సఫలం చేసుకొనేందుకు, చిర-కాలం నిలిచే కీర్తిని సొంతం చేసుకునేందుకు తగిన అవకాశం వచ్చింది. 'బాగా సాన పెట్టబడిన మణి, అడిగినవారికి దానం ఇచ్చిన దాతలు, యుద్ధంలో మరణించిన వీరులు'- ధన్యులు. శక్తి తగ్గటం వల్లనే వీరందరికీ కీర్తి సంప్రాప్తిస్తుంది కదా! అందువల్ల, పిరికి కండ లేని- ఘనమైన ధైర్యం ఉన్న-యోధులనందరినీ యుద్ధానికి సన్నద్ధం అవ్వమనండి. యుద్ధ సమయం దగ్గర పడిందని ఉత్సాహంగా చాటించండి" అన్నది.

అప్పుడా చక్రవాక మంత్రి సంతోషంతో విప్పారిన మొహంతో "ప్రభువులవారు అన్నదంతా శూరజనులు ఇష్టపడేదే తప్ప వేరు కాదు. అయినా తమరి దగ్గర నాకున్న చనువు వల్ల,

చిన్న హితవచనం ఒకదాన్ని- తమరికి విన్నవించుకొన బుద్ధి అవుతున్నది.

మీ మాటకు అడ్డు వస్తున్నానని వేరుగా భావించక, శ్రద్ధ నిండిన చిత్తంతో ఆలకించండి.

ముందుగానే కలహానికి కాలుదువ్వటం ఎవరికైనా మంచిది కాదు. పెద్దలు మెచ్చని అటువంటి పనిని తమబోటి శూరులు ఎలాగూ చేయరు. 'ఉపాయాలన్నిటిలోనూ 'దండోపాయం'- భౌతికంగా కొట్లాడటం- అతి నీచమైనది' అని నీతి తెలిసిన పెద్దలు ఎల్లప్పుడూ హెచ్చరిస్తూ ఉంటారు.

ఏమి చేయబోతే ఏమవుతుందో ఎవరికీ తెలియదు కదా! గెలుపు-ఓటమిలను నిర్ణయించటం ఎవరికి సాధ్యం? అందువల్ల శత్రువులను జయించగోరే మహారాజు- లందరూ ముందుగా సామ-దాన-భేదాలు అనే మూడు ఉపాయాలనీ ముందుగా ప్రయోగించి, తమ పనిని నెరవేర్చుకుంటారు; అవన్నీ విఫలమైనప్పుడు మాత్రమే వారు చివరి ఉపాయమైన 'దండ నీతి'ని ఉపయోగించ- బూనతారు. అయినా 'చివరికి అది ఎటు పోతుందో కదా' అన్న ఆలోచనతో, చివరికి యుద్ధంలో విజయం లభించేంతవరకూ వాళ్ళు 'పాలలో పడిన బల్లి మాదిరి' తల్లడిల్లుతూ ఉంటారు.



అందువల్ల, 'మనతో బాటు ఉన్నవాళ్లందరూ శూరాగ్రేసరులు' అని మురియటం మంచిది- కాదు. ఆపద ఎదురవ్వటానికి ముందు ఇండ్ల దగ్గర మనసులు చల్లగా పెట్టుకొని అందరూ శూరుల మాదిరే కనబడతారు గానీ, యుద్ధంలో మదమెక్కిన శత్రువు మీదికి ఉరికి వచ్చినప్పుడు బెదిరిపోక, ఉత్సాహంతో విజృంభించ గలిగే యోధులు లభించటం నిజంగానే కష్టసాధ్యం.

పరాక్రమం వల్ల, పోట్లాట వల్ల సాధించలేని పనులు అనేకం చిన్న ఉపాయంతో

సాధించబడేవిగా ఉండొచ్చు.

అది తెలుసుకోకుండా శ్రమిస్తే, పడిన పాట్లన్నీ వృధా అవుతాయి తప్ప వేరే ప్రయోజనం ఏదీ ఉండదు. 'దూర భీరుత-ఆసన్న శూరత మహాత్ముల సహజ గుణాలు' అని చెబుతారు. అంటే గొప్పవాళ్లు తాము పూనుకొననవసరం లేని పనుల పట్ల అనాసక్తిని ప్రదర్శిస్తారు; తమ మీద పడిన కష్టాలను మటుకు ధైర్యంతో ఎదుర్కొంటారు అన్నమాట.

తక్కువ రకం వాళ్లలో ఈ గుణాలు వ్యతిరేకంగా ఉండటం కద్దు. వేలవేల శపథాలు చేయటం, పలుమార్లు చేతులెత్తి మొక్కటం, మాటిమాటికీ అభివాదాలు చేయటం, మెత్తగా, ఇష్టంగా మాట్లాడటం- ఇవి దుర్మార్గుల లక్షణాలు. ఇక అబద్ధపు మాటలంటారా, వారికవి వెన్నతోపెట్టిన విద్యలే!

గొప్పవాళ్ళు ఆపదలు ఎదురైనప్పుడు కూడాతమ ధైర్యాన్ని విడచిపెట్టరు. ఆపదలలో ధైర్యం, సంపదలు ఒనగూరినప్పుడు సహనం, సభల్లో అందరినీ మెప్పించేట్లు చతురంగా మాట్లాడటం, యుద్ధం ఎదురైనప్పుడు ధైర్యంగా పోరాడటం- ఇవి మహానుభావులకు సహజసిద్ధంగా లభించే గుణాలు.

అంతేకాదు. మరొక సంగతినీ గుర్తుంచుకోవాలి. చిత్రవర్ణుడు మహా బలవంతుడు; బలవంతుల తోడ్పాటు ఉన్న వాడు. అందువల్ల మనం ఇప్పుడు అతనితో తలపడటం అనేది అడవిలో రాజుకున్న మంటపైకి మిడుతలు ఉరికినట్లే అవుతుంది. ఎంతటి బలవంతుడైనా సరే, తనను ఎదిరించిన వాడితో పోరాడతాడు తప్పిస్తే, అణగి ఉండే వాని మీద తన బలాన్ని ప్రయోగించడు. వేగంగా ప్రవహించే నదీజలాలుకూడా తమను నిలిపి ఎదిరించే వృక్షాలను పెకలించి వేస్తాయి గానీ, వంగి అడుగంటి ఉన్న గడ్డి పోసలను ఏమీ చేయవు! ఓర్పుతో సమానమైన మంచి ఉపాయాలు వేరేవీ లేవు. అందువల్ల తొందరపడటంఅనేది కీడుకు మూలం కావచ్చును.

'తగిన కోటను కట్టుకోవటం ' అనేది మనం ఇప్పుడు అతి త్వరగా చేపట్టవలసిన పని.

కోటలో ఒక్కడున్నా సరే, కోట బయట ఉన్న నూరుగురితో పోరాడే శక్తి ఉంటుంది వానికి. కోటలేని రాజు కొండ నుండి జారి పడిన మనిషితో సమానం: కాబట్టి మనం నిర్మించబోయే కోట కూడా శత్రువులకు అందనిదీ, వాళ్ళు లోనికి చొరబడేందుకు అసాధ్యమైనదీ అవ్వాలి.



చక్కని జలాలతో సమృద్ధంగా నిండి ఉన్న కొలనొకటి ఆ కోటలోనే ఉండాలి. నేను చెప్పవలసినవన్నీ చెప్పాను. ఇక ప్రభువులవారు జరగవలసిన పనులన్నిటినీ నిర్వహించి, కార్యనిర్వహణా ధురంధరులు కావాలి. ఆలస్యం లేకుండా, ముందు ఈ పనికి ఎవరినైనా సమర్థులను నియోగించాలి" అన్నది.

అప్పుడు హిరణ్యగర్భుడు కూడా కొంచెం ఆలోచించి, "సరే, అలాగే కానివ్వండి. కోటను నిర్మించటం చేతనైన నిపుణులను పిలువనంపండి" అన్నది.

వెంటనే ఆ చక్రవాక మంత్రి ఒక సేవకుడిని పంపి శిల్పకళలో నిపుణుడు అయిన సారస పక్షి(బెగ్గురు పక్షి)ని ఒకదాన్ని పిలువమన్నది. అది రాగానే, చక్రవాకం దాన్ని సగౌరవంగా కూర్చోబెట్టి "అయ్యా! సారసోత్తమా! ఈ సమయంలో మాకు నీతో చాలా ముఖ్యమైన పని పడి, నిన్ను ఇట్లా హడావిడిగా పిలువనంపాం.

మనకు తక్షణం ఒక కోట అవసరం ఔతున్నది. ఈ పని చేయటం వేరే వాళ్ళెవరికీ సాధ్యం కాదు- దీని భారం అంతా నీ మీదనే మోపవలసి వస్తున్నది. ఇది నీకూ మంచిదే; స్వామి అనుజ్ఞను కాదనక తలదాల్చు. శత్రువులకు దుర్గమం అయిన కోటను ఒకదాన్ని అతి త్వరగా నిర్మించు. నీ నైపుణ్యం ఎంత గొప్పదో చూపించు!" అన్నది.






# రహస్యం చెబితే...

*అవసరాలు చాలా బలీయమైనవి. ప్రేమలాంటి సున్నిత భావనల్ని ఆర్థిక అవసరాలు నిరాకరిస్తాయి; అణచివేస్తాయి. ఇదిగో, ఈ కథ చదవండి. ఒంటెకు అలా ఎందుకైందంటారు? ఇంతకీ మనం నిజం చెప్పాలా; రహస్యం దాచుకోవాలా?...*

*సేకరణ: తాటం మానస, 7 వతరగతి, యు.పి.యస్. టేకుమట్ల, ఆదిలాబాద్.*

అనగనగా అరేబియా దేశంలో ఖలీల్‌పాషా అనే వ్యాపారి ఒకడు ఉండేవాడు. అతని దగ్గర ఒక ఒంటె ఉండేది. అతనికి ఆ ఒంటె అంటే చాలా ఇష్టం.

ఒక రోజు దాన్ని ఇంటి దగ్గరే కట్టేసి, ఖలీల్‌పాషా బయటకు వెళ్ళాడు. వెనక్కి తిరిగి వచ్చి చూసే సరికి, తన పశువుల కొట్టంలోంచి ఏవేవో శబ్దాలు వస్తున్నాయి. అతను గబగబా కొట్టంలోకి పరుగెత్తి చూసాడు- ఎవరో నలుగురు వ్యక్తులు తన ఒంటెను చంపడానికి ప్రయత్నిస్తున్నారు!

ఖలీల్‌పాషాకు విపరీతమైన కోపం వచ్చింది.

పెద్దగా అరుస్తూ కట్టె పట్టుకొని వాళ్ల మీదికి దూకాడు. వాళ్లందరినీ కొట్టి తరిమివేసాడు.

ఆ తరువాత ఒంటెను అడిగాడు ఖలీల్ పాషా- "నేను ఇప్పటివరకూ చాలామంది దొంగల్ని చూశాను. వాళ్ళు ఒంటెల్ని ఎత్తుకుపోతారు; ఎక్కడికో తీసుకెళ్ళి అమ్ముకుంటారు- కానీ వీళ్ళు మాత్రం నిన్ను చంపాలని చూశారు- ఎందుకు?" అని.

ఒంటె ఏదో చెబుదామనుకున్నట్లు నోరు తెరిచింది- మళ్ళీ ఊరికే ఉండిపోయింది.

"చెప్పు. వీళ్ళెందుకు చంపబోయారు నిన్ను? నాకు చెబితే, నేను కొంచెం జాగ్రత్తపడతాను. మళ్ళీ ఎప్పుడైనా వాళ్ళు నీ వెంట పడితే నిన్ను కాపాడతాను. లేకపోతే నేను మాత్రం ఏం చేయగలను?" అన్నాడు ఖలీల్ చాలా సార్లు.

అతను ఏమన్నా ఒంటె మాత్రం నోరు తెరవలేదు.

మరునాడు ఖలీల్ పాషా నిద్రలేచే సరికి పశువుల పాక ఖాళీగా ఉన్నది- ఒంటె అక్కడ లేదు! ఖలీల్ గబుక్కున లేచి అంతటా వెతికి చూశాడు. ఇదంతా ఆ దొంగలు చేస్తున్న పనే అని అనిపించిందతనికి. అయినా అరేబియాలో దొంగలు ఎటు పోగలరు? ఎడారిలోకే గదా? అందుకని అతను ఎడారిలోకి వెళ్ళి అన్ని ఒయాసిస్సుల దగ్గరా వెతికాడు. చూడగా తన ఒంటె మొదటి ఒయాసిస్సులోనే, నీళ్ళు త్రాగుతూ కనబడింది. ఎంత వెతికినా దొంగల జాడ అయితే, లేదు!



అయితే ఖలీల్ పాషాని చూడగానే ఒంటె బెదురుకున్నదానిమల్లే పారిపోవటం మొదలు పెట్టింది. ఖలీల్ దాని వెంటపడి పట్టుకొని, "నీకేమైంది? ఇట్లా ప్రవర్తిస్తున్నావెందుకు? నిన్ను వాళ్లెవరో- ఎందుకు చంపుదామనుకున్నారో చెప్పు. నేనుండగా నీకు భయం ఎందుకు?" అని రకరకాలుగా అడిగాడు.

ఒంటె ఇక నోరు విప్పకుండా ఉండలేకపోయింది. తనకు, ఆ దొంగలకు మాత్రమే తెలిసిన రహస్యాన్ని అది ఇక దాచలేకపోయింది.

"నా కడుపులో వజ్రాలు ఉన్నాయి. వాటి విలువ కోట్ల కోట్ల దీనారాలు ఉంటుంది. ఆ వజ్రాల కోసమే, వాళ్ళు నా వెంట పడ్డారు. అయితే నీ బలం ఎంతటిదో చూశాక వాళ్ళు పారిపోయారు" అని చెప్పేసింది.

ఖలీల్ పాషా ఆశ్చర్యపోయాడు.

అతను ఒంటెను జాగ్రత్తగా ఇంటికి నడిపించుకొని వెళ్తూ ఆలోచనలో మునిగాడు: 'తనకూ వ్యాపారం ఉంది. వ్యాపారంలో పెట్టుబడి అవసరం ఉంది. వజ్రాలు తనకీ అవసరమే!'

ఇంటికి చేరుకోగానే ఒంటెను చంపేసి, తనే దాని పొట్టలోని వజ్రాలు తీసుకున్నాడు- ఖలీల్ పాషా.

పాపం ఒంటె! రహస్యాన్ని కడుపులో దాచి ఉంచుకోలేక ప్రాణాలే పోగొట్టుకున్నది.

నవ్వు!

గప్పాల రావు గప్పాలు కొడుతున్నాడు:

గ.రా: నేను సింహపు బోనులో ఐదు గంటలు గడిపి వచ్చాను తెలుసా?

అనుమానాల రావు కనుక్కున్నాడు:

అ.రా: ఏముంది, ఆ సమయంలో సింహం బోనులో ఉండి ఉండదు. ఇంకేమి!?



# ఆశపోతుల కథ

*రచన: షేక్‌నాగుల్‌షరీఫ్, అరవింద హైస్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*



రామాపురంలో నివసించే సోమయ్య, రంగమ్మ ఒట్టి ఆశపోతులు. వాళ్లలాగానే తయారయ్యాడు వాళ్ల కొడుకు జంపన్న కూడా. ముగ్గురూ రోజూ కూర్చొని పగటికలలు కంటూ ఉండేవాళ్ళు. ఇంట్లో వంటదినుసులు అయిపోయిన రోజున ముగ్గురూ అడవికి వెళ్ళి కట్టెలు కొట్టుకొచ్చుకునేవాళ్ళు. వాటిని అమ్మితే వచ్చే డబ్బు మూడు రోజులకు సరిపోయేది. వీళ్ళు మూడు రోజులు కలలు గని, నాలుగో రోజున, డబ్బులన్నీ అయిపోగొట్టుకున్నాక- మళ్ళీ గొడ్డళ్ళు చేత పట్టుకొని అడవికి బయలుదేరేవాళ్ళు.

ఆశపోతులు కదా, అందుకని వీళ్ళకు చెట్లన్నీ ఒకేలాగా కనబడేవి- డబ్బులకోసం ఏ చెట్టునైనా కొట్టేందుకు సిద్ధపడేవాళ్ళు వీళ్ళు. ఎంత పచ్చటి చెట్టునైనా నరికేసేవాళ్ళు.

వీళ్ళులాంటివాళ్ళు ఎందరు కట్టెలు కొడుతున్నారో గానీ, చూస్తూండగానే అడవిలో చెట్లన్నీ తగ్గిపోవటం మొదలెట్టాయి. చివరికి అడవి జంతువులకు ఆహారం తక్కువై, రోజూ రాత్రిపూట ఊళ్ళ మీదికి పడటం మొదలయింది.

ఒకరోజు వీళ్ళు ముగ్గురూ అడవిలో కట్టెలు కొడుతుండగా అడవి దేవత ప్రత్యక్షమైంది: "సోమయ్యా, రంగమ్మా! మీలాగే మీ కొడుకును కూడా ఆశపోతుగానే మార్చిన-ట్లున్నారే?! చూడండి, మీరు యీ చెట్లు నరకటంవల్ల నాకు ఎన్ని గాయాలయ్యాయో! నామీద ఆధారపడి జీవించే జంతువులన్నీ ఊర్ల పై పడ్డాయి. అందువలన మీరు కట్టెలు కొట్టటం మానేయండి, ప్లీజ్!" అన్నది.

సోమయ్య, రంగమ్మ తెలివిగా ఆలోచించారు. "ఇదే సమయం, ఈ తల్లి దగ్గరనుండి ఏదైనా రాబట్టితే మనం ఒక్కసారిగా ధనికులం అయిపోవచ్చు" అనుకున్నారు. బయటికి మాత్రం వినయం నటిస్తూ "అయ్యో, తల్లీ! అంతకంటేనా? కానీ కట్టెలు కొట్టితే తప్ప మా పొట్ట గడవదు గదా? మేం కట్టెలు కొట్టటం మానేస్తే బ్రతికేదెలాగ?" అన్నారు.

"మీరు ఏదైనా ఒక్క వరం మటుకు కోరుకోండి, నేను ఆ కోరిక తీరుస్తాను" అన్నది అడవి దేవత.

సోమయ్య, రంగమ్మ మురిసి పోయారు. ఇద్దరూ గుసగుసలాడుకున్నారు. జంపన్న చెవిలోనూ ఏదో ఊదారు. వాడూ నవ్వు ముఖం పెట్టాడు. అప్పుడు సోమయ్య అడవి తల్లితో గట్టిగా "సరేనమ్మా! నీ మాట కాదని మేం ఏం చేయగలం? అట్లానే కానివ్వు. మాకొక మాయ సంచీ ఇవ్వు, చాలు. మేము ఏది అడిగినా ఇవ్వాలి అది!" అన్నాడు. రంగమ్మ, జంపన్న కూడా 'సరిగ్గా అడిగావ'న్నట్లు తల ఊపారు.

అడవితల్లి చిరునవ్వు నవ్వింది. మనసులోనే ఏదో తలచుకొన్నది. మరుక్షణం ఆమె చేతిలోకి ఒక బట్ట సంచీ వచ్చింది. ఆమె ఆ సంచిని సోమయ్యకు ఇస్తూ చెప్పింది: "ఇదిగో, ఈ సంచీని జాగ్రత్తగా కాపాడుకోండి. సంచిని చేత పట్టుకొని, నన్ను తలచుకొని,

మీకేం కావాలో చెప్పండి. మీరు కోరిందల్లా ఈ సంచిలో ప్రత్యక్షమౌతుంది. అయితే ఒక సంగతి గుర్తుపెట్టుకోండి: 'ఈ సంచికి అస్సలు చిల్లి పడకూడదు! ఎంత చిన్న చిల్లి పడినా సరే- మీరు కోరుకున్నది అంతా మట్టిలా మారిపోతుంది. తెలివిగా, ఆలోచించుకొని వాడుకోండి" అని చెప్పింది. సోమయ్య, రంగమ్మ ఆ సంచీని అందుకొని సంతోషంగా నమస్కరించారు ఆమెకు. ఆమె వాళ్ళను ఆశీర్వదించి "మరొక్కమాట- ఈ సంచీని గ్రహించటం వల్ల ఈ అడవికి మీతో రుణం తీరిపోయింది. అందువల్ల ఇక మీరు ఇటువైపుకు రానే కూడదు. ఇంకోసారి ఈ అడవిలోకి వచ్చారంటే మీరు కూడా చెట్లలాగా మారిపోతారు- జాగ్రత్త!" అని చెప్పి సాగనంపింది.

సోమయ్య కుటుంబం ఆ సంచిని చేతబట్టుకొని సంతోషంగా ఇంటికి బయలుదేరింది. "భలే వరం కోరాం! ఈ ఒక్కవరంతో మన గొప్ప ధనికులం అయిపోవచ్చు!" అనుకుంటున్నారందరూ. పోతూ ఉంటే జంపన్నకు ఒక ఐడియా వచ్చింది: "నాన్నా! అడవితల్లి చెప్పింది కదా, ఈ సంచికి చిన్న రంధ్రం పడినా పని చేయదని? అందుకని ముందుగా మనం ఒక పని చేద్దాం. ఈ సంచిని ప్రార్థించి, ఇలాంటి మాయ సంచినే మరొకటి ఇవ్వమందాం! అలాగైతే ఈ సంచి పోయినా మనకు ఎంచక్కా మరో సంచి ఉంటుంది కదా!" అన్నాడు.

"అవునవును" అని సోమయ్య సంచిని ప్రార్థించి, "నీలాంటి మాయ సంచీనే మరొకటి ఇమ్మ"న్నాడు. ఆ తర్వాత సంచీలో చేయి పెడితే ఖచ్చితంగా దాని లాగానే ఉన్న సంచీ మరొకటి దొరికింది! రంగమ్మ, జంపన్న ఇద్దరూ హాయి హాయిగా నవ్వారు. ఆ సరికి ముగ్గురూ ఇల్లు చేరుకున్నారు.

"చెప్పు, మనం ఈసారి ఏం కోరుకుందాం? నీకు ఏమేం కావాలి?" అన్నాడు సోమయ్య.

"కూరగాయలు, పప్పులు-ఉప్పులు, ధాన్యం, బంగారం" అన్నది రంగమ్మ.

"కూరగాయలు పెట్టుకునేందుకొక ఫ్రిజ్, కూలర్లు, ఫ్యాన్లు, పెద్ద డాబా ఇల్లు..." జత చేసాడు జంపన్న.

"అవునవును, అన్నీ కావాల్సిందే" అని సంచీని అన్నీ అడిగాడు సోమయ్య.



అంతే, సంచీ కాస్తా చినిగిపోయి, వంద ముక్కలైంది- అంత చిన్న సంచీలో ఇవన్నీ పట్టవు గదా?!

"ఒక్క వరం కూడా కోరకనే సంచీ చినిగిపోయిందే!" అని బాధ పడుతున్న రంగమ్మను ఓదారుస్తూ జంపన్న "ఇది పోతే మాత్రం ఏమి, మన దగ్గర మరొక మాయ సంచీ ఉన్నదిగా? మన ముందు జాగ్రత్త ఇలా అక్కరకొచ్చింది" అన్నాడు.

అయితే వెళ్ళి చూసే సరికి అక్కడ సంచీ లేదు- మట్టి కుప్ప ఉన్నది. సంచీకి చిల్లి పడే సరికి అది సృష్టించినవన్నీ మట్టి కుప్పలయ్యాయి, రెండో సంచీతో సహా!

ఆశపోతు కుటుంబానికి ఉన్న కాస్తంత ఆధారమూ పోయినట్లయింది. వాళ్ళిప్పుడు అడవికి వెళ్ళి కట్టెలూ కొట్టుకు రాలేరు!

చేసేదేమీ లేక ముగ్గురూ వేరే ఊరుకు వలస పోయారు- 'కనీసం ఇక్కడన్నా బాగా కష్టపడి పనిచేద్దాం- మనకొద్దు ఈ మాయలూ మంత్రాలూ' అనుకుంటూ. 

దు:ఖాన్ని మించిన దరిద్రం లేదు; సంతోషాన్ని మించిన సంపద లేదు




# అవకాశం వదలకండి

*"మనలో చాలా మంది ఈ రాజుగారిలాంటి వాళ్ళు ఉన్నారు. అందని కొండ ఏదో ఎక్కాలని ఆశించి, ఆలోగా ఎదురైన అవకాశాలన్నింటినీ జారవిడుస్తుంటారు. అలా ఉండకూడదు" అంటోంది ప్రియభావని..*
*స్వేచ్ఛానువాదం: వి. ప్రియభావని, 7 వతరగతి, తేజటాలెంట్ స్కూల్, కోదాడ.*

ఒక ఊరికి వరదలు వచ్చాయి. అందరూ హడావిడిగా ఇళ్ళు వదిలేసి వెళ్ళాల్సిన పరిస్థితి ఏర్పడింది.

రాజుగారి కోట కూడా వరదలో మునిగిపోయే ప్రమాదంలో పడింది. కానీ రాజుగారు మాత్రం "నేను దైవభక్తుడిని. నన్ను దేవుడే రక్షిస్తాడు!" అనుకుంటూ ఇంట్లోంచి కదల్లేదు.

నీటి మట్టం పెరుగుతూనే ఉంది. రాజుగారి ఇంట్లోవాళ్ళు, పొరుగువాళ్ళు అందరూ రాజుగారిని తమవెంట రమ్మన్నారు. రాజుగారు ఒప్పుకోలేదు. "నన్ను దేవుడే కాపాడతాడు" అన్నారు. వాళ్లందరూ

ఆయన్ని అక్కడే వదిలేసి సురక్షిత ప్రాంతాలకు చేరుకున్నారు.

రాజుగారు ఒక్కరే పై అంతస్తుకి ఎక్కారు. ఊరంతా అల్లకల్లోలంగా ఉంది. కొంతమంది పడవల్లో తిరుగుతూ ఇళ్ళల్లో చిక్కుకు-పోయిన వారిని రక్షిస్తున్నారు.



వాళ్లలో ఒక పడవవాడు రాజుగారిని పిలిచాడు. "రా, త్వరగా పడవెక్కు! లేకపోతే మునిగిపోతావు!" అన్నాడు.

రాజుగారు పోలేదు. "నన్ను దేవుడే కాపాడతాడు" అన్నారు.

వరద నీరు ఇంకా పెరిగిపోతుండటంతో రాజుగారు పై కప్పు మీది కెక్కారు. వరదలో చిక్కుకుపోయిన వాళ్ళని రక్షించడానికి అంతలో ఓ హెలికాప్టర్ వచ్చింది. అందులోంచి పైలట్ గట్టి తాడుని ఒకదాన్ని కిందికి విసిరాడు. "దాన్ని పట్టుకో - పైకి లాగుతాం!' అని అరిచాడు. అయినా రాజుగారు "నన్ను దేవుడే రక్షిస్తాడు " అంటూ పాత పాటే పాడారు.

అటు తర్వాత ఇంక వేరే ఎవ్వరూ రాలేదు. వరద ఇంకా ఎక్కువైంది. రాజుగారు నీళ్ళలో పడి చచ్చిపోయారు.

మళ్ళీ చూసేసరికి ఎదురుగా దేవుడు ఉన్నాడు- పాప పుణ్యాల లెక్కలు సరి చూసుకుం-టున్నాడు. రాజుగారు దేవుడ్ని నిలదీశాడు- "నేను నీ భక్తుడిని కాదా, మరి నాకెందుకు సాయం చెయ్యలేదు?" అని.

"ఏంటి నువ్వు మాట్లాడేది? నేను నీ పొరుగువాడ్ని పంపాను; పడవ పంపాను; హెలికాప్టర్ పంపాను- నువ్వు సాయమే తీసుకోకపోతే నేనేం చెయ్యాలి?!" అన్నాడు దేవుడు.

అవకాశాల్ని పంపించేదీ దేవుడే గద, మరి!?



# తనుష్ కథ

*దివ్య రాసిన ఈ కథకాని కథని పొడిగించి, అందంగా ముగించాం మేము. సారాయి భూతం తనుష్ లాంటి ఎంతమంది పిల్లల జీవితాలతో ఆడుకుంటున్నదో చూస్తే నిజంగానే కడుపు తరుక్కుపోతుంది. మన సమాజాన్ని ఈ భూతం ఎప్పటికి వదుల్తుందో.. రచన: బి.దివ్య, 10 వ తరగతి, అభ్యాసవిద్యాలయం.*

అనగనగా ఒక ఊరిలో తనుష్ అనే ఒక పిల్లవాడు ఉండేవాడు. చాలామంది పిల్లల్లాగే వాడుకూడా హాస్టల్‌లో ఉండేవాడు. "బాగా చదువుకోవాలి బాబూ! నువ్వు మంచి పిల్లవాడిగా ఎదిగితే, మన కష్టాలన్నీ తీరతాయి" అంటుండేది వాళ్ళ అమ్మ. "ఏం కష్టాలమ్మా?" అని అమాయకంగా అడిగేవాడు తనుష్. "పెద్దయ్యాక తెలుస్తాయిలే బాబూ, నువ్వు మాత్రం బాగా చదువుకోవాలి-సరేనా?" అనేది అమ్మ. వాడికి ఆ మాటలు ఏమీ అర్థం అయ్యేవి కాదు- అయినా వాడు మటుకు చక్కగా చదువుకునేవాడు మనసుపెట్టి.

ఒక సారి వాడు వాళ్ళ అమ్మ, నాన్న తో కలిసి పట్నం వెళ్ళాడు. వాడిని, అమ్మను అక్కడ వదిలి, వాళ్ల నాన్న 'ఇప్పుడే వస్తాను ఉండండి' అని ఎటో వెళ్ళాడు.

"ఇంట్లో దీపం పెట్టేందుకు నూనె బొత్తిగా లేదు. రోడ్డు అవతల, ఆ దుకాణంలో కాసింత నూనె తీసుకురా బాబూ" అని పది రూపాయలు చేతిలో పెట్టింది అమ్మ.

తనుష్ రోడ్డు దాటి కొట్టు దగ్గరికి వెళ్ళాడు. వాళ్ళ అమ్మ ఒక్కతే అటు ప్రక్కన నిలబడి ఉన్నది: అంతలో ఏమైందో ఏమో- అకస్మాత్తుగా అటు ప్రక్క నుండి లారీ ఒకటి వచ్చి గుద్దింది అమ్మను. ఆ శబ్దానికి వెనక్కి తిరిగి చూసిన తనుష్ 'అమ్మా' అని అరుస్తూ అమ్మ దగ్గరికి చేరుకున్నాడు.

అక్కడున్నవాళ్లంతా అమ్మ చుట్టూ గుమిగూడారు- "చాలా రక్తం పోయింది- వెంటనే ఆస్పత్రికి తీసుకెళ్తే బ్రతుకుతుంది" అంటున్నారు. తనుష్ వాళ్ల నాన్నకోసం చూశాడు- నాన్న ఆ దగ్గర్లోనే లేడు. తనుష్ వాళ్ళమ్మ తల ఒళ్ళో పెట్టుకొని ఏడిచాడు.

అంత బాధలోనూ వాళ్లమ్మ కళ్ళు తెరిచి, "మీ నాన్న ఏదో ఒక సారా దుకాణంలో ఉంటాడు - చూసి పిల్చుకురా నాయనా, నాకేం కాదులేగాని" అన్నది.

తనుష్ ఆమెను అక్కడే వదిలేసి దుకాణాల్లో చూస్తూ పోయాడు. చివరికి వాళ్ళ నాన్న ఓ సారా దుకాణంలో కనబడ్డాడు. అప్పటికే నిషాలో ఉన్నట్లున్నాడు- తనుష్ చెప్పేది అతనికి కొంత సేపటి వరకూ అర్థమే కాలేదు. తీరా ఇద్దరూ వచ్చేసరికి తనుష్ వాళ్ళమ్మ చనిపోయి ఉన్నది!

ఆ తర్వాత గానీ తనుష్‌కి తెలియలేదు- వాళ్ల నాన్న బాగానే సంపాదిస్తాడు- కానీ సంపాదనంతా సారాకే ఖర్చుపెడతాడు. అంతే కాదు- రోజూ త్రాగివచ్చి, ఇంకా డబ్బులు ఇమ్మని తనుష్ వాళ్ళ అమ్మని పీడించేవాడు. ఇవ్వకపోతే కొట్టేవాడు. అమ్మ పాపం, మంచిది. ఇవన్నీ తనకు తెలియనివ్వలేదు: "హాస్టల్ లో ఉండు నాయనా, బాగా చదువు" అని మాత్రం చెబుతుండేది తనకు.

అమ్మ చనిపోయాక తనుష్‌కి కష్టాలంటే

ఏమిటో తెలిసి వచ్చాయి. నాన్న వాడిని అస్సలు పట్టించుకునేవాడు కాదు. హాస్టలు ఖర్చులకి, చదువుకోటానికి, ఫీజులు కట్టటానికి- దేనికీ డబ్బులు అందించలేదు ఆయన. చూస్తూ చూస్తూండగానే తనుష్‌కి పిలుపు వచ్చింది- "నాన్న ఆరోగ్యం బాగా లేదు- ఆస్పత్రిలో ఉన్నాడు".

సారాయి వల్ల తనుష్ వాళ్ళ నాన్న కాలేయం పూర్తిగా చెడిపోయింది. కడుపునొప్పి, వాంతులు- అనారోగ్యంతో పోరాడి పోరాడి, చివరికి కన్నుమూశాడాయన.

అకస్మాత్తుగా తనుష్ ఒంటరివాడయ్యాడు.

ఆ సమయంలో తనుష్ వాళ్ల అత్త-మామ ముందుకు వచ్చి అతన్ని చేరదీసారు. "చూడు తనుష్, నీకు మేం సంరక్షకులంగా ఉంటాం. కానీ మేమూ పెద్దగా ఉన్నవాళ్ళం కాదు కదా, నీ అవసరాలకు తగినన్ని డబ్బులు నువ్వే, సెలవుల్లో పనిచేసి సంపాదించుకోవాలి" అన్నారు వాళ్ళు. "మీకెలాంటి కష్టమూ రానివ్వను మామయ్యా" అన్నాడు తనుష్ ధైర్యంగా.

మరుసటి సంవత్సరం వాడు గురుకుల పాఠశాల ప్రవేశ పరీక్ష రాసాడు. బాగా చదివి ఉండటంతో వాడికి ఆ బడిలో సీటు దొరికింది. అక్కడ చదువులు, భోజనాలు, వసతి- అన్నీ ప్రభుత్వమే చూసుకున్నది. సెలవల్లో దుకాణాల్లో సరుకులు అందించే పని చేయటం మొదలు పెట్టాడు వాడు.

పన్నెండో తరగతి అయ్యేసరికి అతనికి ఐఐటీలో సీటు వచ్చింది. ఉపాధ్యాయుల ప్రోత్సాహంతో వాడు ఐఐటీలో ఇంజనీరింగు చదివాడు. పేద పిల్లలకు ప్రభుత్వం వారు ఇచ్చే ఉపకార వేతనం వాడికి చాలా ఉపయోగపడింది. చదువు పూర్తయ్యేసరికి అతనికి ఒక ప్రైవేటు సంస్థలో ఉన్నతోద్యోగం కూడా లభించింది!

తనుష్ తన సంపదలో అధిక భాగాన్ని ఇప్పుడు పేద పిల్లల చదువులకోసం వెచ్చిస్తున్నాడు. సారాయి బారిన పడ్డవాళ్ల కుటుంబాలను ఆదుకోవటంలోను, మత్తు మందులకు వ్యతిరేకంగా జరిగే ఉద్యమాలలోను ముందు నిలుస్తున్నాడు. త్రాగుడు వల్ల ఎంత నష్టమో అందరికీ చెబుతున్నాడు. 



# బాధ్యత

రచన: పి. గాయత్రిదేవి, ఖైరతాబాద్, హైదరాబాదు. పున:కథనం: కొత్తపల్లి

అయినాపురంలో ఉన్న ఒక ప్రైవేటు పాఠశాల వాళ్ళు తమ బడిలో ముఖ్య కార్యదర్శి ఉద్యోగంకోసం అర్హులైన అభ్యర్థులను ఇంటర్వ్యూకి పిలిచారు.

అది వర్షాకాలం. ఆ ఊరికి రహదారులు సరిగా లేవు.

అదీకాక ఆ పాఠశాల ప్రదేశమంతా బురద బురదగా ఉంది.

పది గంటల సమయంలో ఇంటర్వ్యూలు మొదలయ్యాయి. వచ్చిన అభ్యర్థులు అందరూ అలాగే బురద లోంచి నడుచుకుంటూ ఆదరాబాదరాగా హాలులోకి చేరారు.

అక్కడ ఒకావిడ కూర్చొని ఉన్నది. వాళ్లందరి పేర్లనూ తన దగ్గరున్న రిజిస్టరులో రాసుకొని, వరసగా ఒక్కొక్కరినే లోనికి పంపసాగింది.

మిగిలినవాళ్లంతా అక్కడే కుర్చీలలో ను, బెంచీల మీదా కూర్చొని తమ వంతుకోసం ఎదురు చూడసాగారు.

వాళ్లలోనే ఒకడైన రవి కొంతసేపు ఊరికే కూర్చున్నాడు. తన వంతు వచ్చేందుకు ఇంకా చాలా సమయం పట్టేటట్టున్నది- 'ఆలోగా ఏం చేద్దాం?' అనుకున్నాడు. 'చదువుకునేందుకు ఏమైనా తెచ్చుకొని ఉంటే బాగుండేది' అనుకున్నాడు. 'సరేలే, ఇక్కడే ఏదో ఒక పని చేస్తుంటే సరి' అని సమాధానపడి, అటూ ఇటూ చూశాడు.

పాఠశాల ప్రాంగణం అంతా బురద బురదగా ఉంది. ఒక పక్కన ఇసుక, పాత ఇటుకలు గుట్టలుగా పడి ఉన్నాయి. ఇసుకలో ఒక తట్ట, పార ఉన్నాయి. రవి మెల్లగా లేచి అక్కడికి వెళ్ళాడు. పారతో ఇసుకను, ఇటుక ముక్కల్ని కొద్ది కొద్దిగా ఎత్తి దారిలో పోయటం మొదలు పెట్టాడు. మెల్లగా ఆ బురద మధ్యలోంచి చక్కని- సన్నని బాట ఒకటి తయారైంది.

"రవీ! రవీ! ఎవరయ్యా ఈ మనిషి, పేరు ఇచ్చి ఎక్కడికి వెళ్ళాడు? అందరివీ ఇంటర్వ్యూలు అయిపోయాయి- ఇతనొక్కడే మిగిలాడు!" అని ఎవరో అరుస్తుంటే రవి ఈ లోకంలోకి వచ్చాడు. గబగబా లోపలికి పరుగెత్తి చెప్పాడు, "నేనేనండీ, రవిని" అంటూ.

"ఎన్ని సార్లు పిలవాలయ్యా, నిన్ను? ఇంటర్వ్యూకి వచ్చేది ఇలాగేనా? నీ చేతులు ఎంత మురికిగా ఉన్నాయో చూడు? ఇన్‌షర్ట్ చెదిరిపోయింది" కేకలు వేశాడు ఇంటర్వ్యూ బోర్డులో కూర్చున్న ఒక పెద్దాయన.

రవి తల వంచుకున్నాడు- "ఖాళీగా కూర్చోవటం ఎందుకని, ఇక్కడే చిన్నగా ఏదో పని చేస్తూ ఉండిపోయాను సార్, క్షమించండి" అన్నాడు.

పాఠశాల ఛైర్మన్ రావుగారు కుర్చీలోంచి లేచి బయటికెళ్ళి చూశారు- "ఈ ఇసకంతా అక్కడినుండి తెచ్చి పోసింది నువ్వేనా?" అడిగారు. అవునన్నట్లు రవి తల ఊపాడు.

"మంచిపని చేసి తల వంచుకుం-టావేమయ్యా? తల నిటారుగా ఎత్తి మాట్లాడాలి, ఇంటర్వ్యూలో. ఇంతకీ నీకు

ఎంత జీతం ఇమ్మంటావు? ఉద్యోగంలో ఎప్పటినుండి చేరతావు?" సూటిగా అడిగేశారు రావుగారు.

రవి నిర్ఘాంతపోయాడు.



రావుగారు తమ బడిలో పని చేస్తున్న ఉద్యోగులందరినీ రమ్మని, వాళ్లకు రవిని పరిచయం చేస్తూ అన్నారు: "డిగ్రీలు ఎందుకు? 'ఫలానావాడికి పనిచేసే సామర్ధ్యం ఉన్నది'అని తెలపటం వరకూ డిగ్రీలు చేస్తాయి. అంతే తప్ప, అవి మనుషుల వ్యక్తిత్వాన్ని పూర్తిగా ప్రతిఫలించవు. మీరు చూస్తున్న ఈ రవి, సమయాన్ని వృధా చేసే మనిషి కాదు. పనిచేయటానికి ఉత్సాహంగా ముందుకు వచ్చే వ్యక్తికి ఉదాహరణ ఇతను. ఇప్పటిదాకా ఇతను చేసిన పనే, అతని వ్యక్తిత్వానికి నిదర్శనం. మిగిలినవాళ్ళంతా 'తమ బాధ్యత కాదు' అనుకుని బురదని తొక్కుకుంటూ వచ్చారు; చుట్టూ ఉన్న ప్రదేశాన్ని ఇంకా బురద చేసి వెళ్ళారు. ఇతను ఖాళీగా కూర్చోకుండా, తన సమయాన్ని సద్వినియోగం చేయటం గురించి ఆలోచించాడు. ఈ కొద్ది సేపట్లోనే పదిమందికీ ఉపయోగపడే పని చేశాడు. ఇలాంటి వ్యక్తిని నేను వదులుకుంటే మన సంస్థకే లోటు. అందుకని ఇతనికి నేను ముఖ్య కార్యదర్శి ఉద్యోగం ఇస్తున్నాను. త్వరగా వచ్చి చేరమని అభ్యర్థిస్తున్నాను" అని ప్రకటించారు. అందరూ చప్పట్లతో రవికి తమ అభినందనలు తెలిపారు.

సిగ్గుతోటీ, సంతోషంతోటీ రవి ముఖం వెలిగిపోయింది.

**సంతోషము సగము బలము**



# కోచింగ్ టెన్షన్

*గురుపూజోత్సవ ప్రత్యేకం*

*రచన: యోగి, అరవిందాస్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*



జనహిత కోచింగ్ సెంటర్ అంటే రాష్ట్రవ్యాప్తంగా చాలా మంచి పేరు ఉన్నది. అక్కడ చదివిన పిల్లలందరికీ పెద్ద-పెద్ద కాలేజీల్లో సీట్లు వస్తాయని పేరు. అయితే అక్కడ కోచింగ్ ఊరికే దొరకదు- చాలానే ఖర్చు అవుతుంది. అయినా పిల్లల బాగు కోరే తల్లిదండ్రులు అప్పో-సప్పో చేసి, తమ పిల్లల్ని జనహితలో చేర్పిస్తూ ఉండేవాళ్ళు.

అట్లాగే తమ కొడుకు ధనుష్‌ని జనహితలో చేర్చారు, వాళ్ల అమ్మవాళ్ళు. ధనుష్ చాలా మంచి పిల్లవాడు. అతనికి తల్లిదండ్రులపై నమ్మకం, గురువులపై భక్తి, చదువులంటే శ్రద్ధ- చదువుకునేందుకు కావలసిన మూడు అంశాలూ అతనిలో ఉన్నాయి.

అయితే జనహితకు వచ్చాక ఎందుకో, అతనిలో ఒక భయం మొదలైంది.

ముఖ్యంగా, రాఘవేంద్ర సార్ అంటే.

రాఘవేంద్ర సార్ హిందీ చెబుతారు. పాఠాలు చాలా చక్కగా చెబుతారు. సమస్యల్లా ఆయన ప్రవర్తన తోటే. ఆయన ఎప్పుడూ ఎవరో ఒకళ్లను తిడుతూనే ఉండేవాడు. తరగతిలో ఎవరో ఒక పిల్లవాడినైనా కొట్టని రోజంటూ ఉండదు. ఆయన్ని చూస్తేనే పిల్లలందరూ జడుసుకునేవాళ్ళు. అయితే "ఆ భయం అవసరం" అని ఆయన చెబుతూ ఉండేవాడు ."ఎందుకంటే, భయం ఉన్న పిల్లలు చదువుతారు. చదివితే మంచి మార్కులు వస్తాయి". ఇన్నాళ్ళుగా 'అది నిజమే' అని తేలింది కూడానూ: జనహిత పిల్లలు ఎవ్వరూ హిందీలో తప్పు ఎరుగరు.

ధనుష్ అన్ని సబ్జెక్టులూ బాగానే చదివేవాడు గానీ, హిందీ మాత్రం వాడికి సరిగా వచ్చేది కాదు. నిజానికి వాడికి హిందీ అక్షరాలే సరిగ్గా రావు! అయినా వాడు ఎన్నడూ తన కష్టాన్ని సారుకు చెప్పే ధైర్యం చేయలేదు. అయితే సంవత్సరాంతపు పరీక్షలు దగ్గరకొచ్చేసరికి, వాడికి చాలా భయం పట్టుకున్నది. పరీక్షలో వస్తాయనుకున్న ప్రశ్నలన్నిటికీ తెలుగులోనే జవాబులు వ్రాసుకొని, వాటిని ఒక్కొక్కదాన్నే బట్టీ వేసాడు. 'అన్నీ ముక్కున పెట్టుకొని వెళ్ళి, పరీక్షలో వదిలేసి వచ్చేస్తే సరి- తర్వాతి సంగతి తర్వాత చూసుకోవచ్చు!'

పరీక్షలు రానే వచ్చాయి. రేపు హిందీ పరీక్ష అనగా పిల్లలందరూ ఎవరికి వాళ్ళు చదువుతున్నారు. వాతావరణం అంతా గందరగోళంగా ఉన్నది. కొంతమంది పిల్లలు మాత్రం చదవటం ఆపి వేరే ఏవో సంగతులు ముచ్చటించుకోవటం మొదలు పెట్టారు. అంతలో ఎక్కడి నుండి వచ్చారో, రాఘవేంద్రసార్ వచ్చారు. ఆ పిల్లల వెనకనే ఆగి, తన దగ్గర ఉన్న బెత్తంతో వాళ్లను చితక బాదారు. ఆయన కోపాన్ని చూసిన ధనుష్‌కి మతి పోయినట్లు అయ్యింది. చదువుతు-న్నాడో, లేదో కూడా తెలియకుండా భయంతోటే హిందీ చదవటం కొనసా-గించాడు; కానీ బుర్రలోకి ఏమీ ఎక్కటంలేదు. చూస్తూండగానే నిద్ర పట్టేసింది. ఉదయాన్నే లేచి "ఏమీ పరవాలేదులే" అనుకొని పరీక్ష

రాశాడు. ఏమీ లాభం లేకపోయింది: వాడికి అన్ని సబ్జెక్టులలోనూ మంచి మార్కులు వచ్చాయి- ఒక్క హిందీలో తప్ప!



ధనుష్ భయంతోటీ, సిగ్గుతోటీ వణికి-పోయాడు. రాఘవేంద్ర సార్ తనని ఏం చేయబోతున్నాడో ఊహించుకుంటేనే వాడికి చెమటలు పట్టాయి. వాడి మెదడు పనిచేయటం మానివేసింది. ఇంకొంచెం సేపట్లో సార్ వచ్చేస్తారు- తను ఆలోగా ఏదైనా చేసెయ్యాలి- అని మెదడులో ఆలోచన సుడిలాగా తిరిగింది. "ఇక్కడినుండి తప్పించుకోవాలి- దూకి పారిపోతాను" అని వాడు కోచింగ్ సెంటరు మేడపైనుంచి దూకెయ్యబోయాడు-

అంతలోనే ఎవరో వాడిని గట్టిగా పట్టుకొని వెనక్కి లాగారు. "వదలండి-నేను పారిపోవాలి- రాఘవేంద్ర సార్ నన్ను చంపేస్తారు- నేను హిందీలో తప్పాను" అరుస్తున్నాడు ధనుష్.

రాఘవేంద్ర సార్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి- "నేను నిన్నేం అననులేరా- నిన్నే కాదు; అసలు ఎవ్వరినీ కొట్టను- ఇకనుండీ మీకు ప్రేమగానే పాఠాలు చెబుతాను. పిల్లల్ని అస్సలు బెదిరించను. ఊరుకో!" అని మళ్ళీ మళ్ళీ చెప్పారాయన.

అటుపైన ఆయన చాలా మారిపోయారు. ఓపికతోటీ, ప్రేమగానూ ఆయన పాఠాలు చెబుతుంటే మిగతా పిల్లలందరికీ కూడా హిందీ బాగా వచ్చేసింది. అందరూ మంచి మార్కులతో పాసయ్యారు. బెదిరింపులతో కాదు; ప్రేమగా, అర్థం చేయించటం ద్వారా నేర్పినవాడే మంచి గురువు. 



# వెంట్రుకల దయ్యం

*దయ్యాలు నిజంగా లేవుగానీ, మనీష కథలో చక్కటి మందు మటుకు ఉంది. మీకు ఎప్పుడైనా దయ్యం ఉన్నట్లు అనిపించిందనుకోండి, ఈ మందుని తప్పకుండా వాడండి..*

*రచన: కె. మనీషా, 7 వతరగతి, ఆర్.ఇ.సి, పగడాలవారిపల్లె, చిత్తూరు జిల్లా.*

అనగా అనగా ఒక అడవి. ఆ అడవిలో ఒకే ఒక ఇల్లు ఉంది. ఆ ఇంటి ప్రక్కనే ఒక కొట్టం ఉంది. ప్రక్కనే పెద్ద సరస్సు ఉంది.

అడవి ఉంది; అకాశం ఆకుపచ్చగా ఉంది!

ఆ ఇంటిలో ఇద్దరే ఇద్దరు జీవిస్తున్నారు. వాళ్లు భార్యాభర్తలు- రామయ్య, సీతమ్మ.

వాళ్ళిద్దరూ ఆవులు మేపేవాళ్ళు. ప్రక్కనే వున్న కొట్టంలో ఆవులను కట్టేసేవాళ్ళు.

అయితే ఒకరోజున ఉదయం నిద్రలేచి చూసేసరికి కొట్టంలో ఆవులు లేవు.

అది చూసి సీతమ్మ , రామయ్య భోరున ఏడ్చారు. "ఈ ఆవులే మనకి జీవనాధారాలు.

ఇవి పోయాక మనం ఎలా జీవించాలి?" అని ఏడ్చారు.

మనసు ఆగక ఇద్దరూ అడవంతా తిరిగి చూశారు. ఎక్కడా ఆవుల జాడే లేదు.

"నాలుగైదు రోజులుగా నాకు ఏదో గజ్జెల శబ్దం వినబడుతూనే ఉన్నది. ఇక్కడేదో దయ్యం చేరుకున్నట్లుంది. అదే మన ఆవుల్ని ఇలా చేసి ఉంటుంది" అన్నది సీతమ్మ.

అప్పుడు రామయ్య , సీతమ్మ తో "మన ఆవులు ఎలా పోయినాయో, ఎక్కడికి పోయినాయో నేను ఈ రోజు కనిపెట్టాలి. ఏ దయ్యమైనా సరే, ఏ రాక్షసైనా సరే, నేను దాన్ని ఎదిరించి పట్టుకుంటాను. నా ఆవుల్ని నేను వెనక్కి తెచ్చుకుంటాను" అన్నాడు.

సాయంత్రం కాగానే పూరిగుడిసె దగ్గరికి వెళ్ళి విచారంగా కూర్చున్నాడు రామయ్య. సీతమ్మ కళ్ళు నీళ్ళు పెట్టుకొని అతన్నే చూస్తూ ఉన్నది.

ఆ సరికి కొద్ది కొద్దిగా చీకటి పడింది. ఆవుల్ని ఎత్తుకుపోయిన దయ్యం వాటిని ఎవ్వరికీ కనబడకుండా అక్కడే ఉంచింది. దానికి ఇప్పుడు సంతోషం ఎక్కువై గజ్జెలు కట్టుకొని ఆడటం మొదలుపెట్టింది.

రామయ్య, సీతమ్మ అక్కడే కూర్చొని దాని గజ్జెల చప్పుడు విన్నారు. సీతమ్మ భయ పడుతూ "అమ్మో, దయ్యమే! నాకు చాలా భయంగా ఉంది. ఈ అడవి వదిలి వెళ్ళిపోదాం, పదండి" అన్నది.



అయితే ఆ గజ్జెల చప్పుడు వింటున్న కొద్దీ రామయ్యకు కోపం పట్టవశంకాలేదు. "ఈ దయ్యానికి ఏంటీ, మనం భయపడేది?! నా దగ్గర ఒక ఉపాయం ఉంది. చూస్తాండు

దాన్ని ఏంచేస్తానో?" అని గబగబా ఆ దయ్యం మీదికి పరుగెత్తాడు.

రామయ్యను చూడగానే దయ్యం నాట్యం ఆపి మాయమైపోదామనుకున్నది.

అయితే అంతలోనే రామయ్య వెళ్ళి దాని వెంట్రుకలు గట్టిగా పట్టుకున్నాడు- "కత్తిరించేస్తాను, జాగ్రత్త!" అని బెదిరించాడు.

దయ్యం ఇట్లాంటి మనుషుల్ని ఎప్పుడూ చూడలేదు. 'తనని చూసి భయపడేవాళ్ళు తప్ప, ఎవరూ తన మీదికి వచ్చి ఎరుగరు! అదీ గాక, వీడు తన జుట్టును ఎంత గట్టిగా పట్టుకున్నాడంటే, తనకి బాగా నెప్పి పెడుతున్నది. ఇక తను ఏం చేసేందుకూ వీలయేట్లు లేదు!' అని ఆ దయ్యం భయపడి పోయింది. "నన్ను ఏం చేయద్దు! నన్ను ఏం చేయద్దు! ఏవైనా మూడు కోరికలు కోరుకో! తీరుస్తాను!" అంది.

అప్పుడు రామయ్య "ఇదిగో, కోరుతున్నాను చూడు- మొదటి కోరిక: నా ఆవుల్ని నాకు ఇచ్చెయ్యాలి. రెండవ కోరిక: నువ్వు ఇక్కడి నుండి వెళ్ళిపోవాలి. మూడవ కోరిక: నాకు ఇట్లాంటి బెడదలు ఏవీ లేని మంచి జీవితం కావాలి. అన్నాడు.

దయ్యం ఇంకేం చేస్తుంది? అతని కోరికలు మూడూ తీర్చి వెళ్ళిపోయింది.

తమ అవులు తిరిగి వచ్చినందుకు సీతమ్మ చాలా సంతోషపడింది. అటుపైన రామయ్య సీతమ్మ ఇద్దరూ ఎప్పటిమాదిరే సంతోషంగా జీవించారు.



పద్యం

ఏరకుమీ కసుగాయలు
దూరకుమీ బంధుజనుల దోసము సుమ్మీ!
పారకుమీ రణమందున
మీరకుమీ గురువునాజ్ఞ మేదిని సుమతీ!

పసరు పిందెలను కోయకు-
మేలు కోరేవాళ్లను తిట్టకు-
యుద్ధం నుండి పారిపోకు-
గురువు ఆజ్ఞను మీరకు- తప్పు సుమా!



# దురాశ

*చిత్తూరు జిల్లా జానపద కథ*
*సేకరణ: సునిల్‌కుమార్, 7 వతరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరుజిల్లా.*

ఒక ఊరిలో ముగ్గురు అన్నదమ్ములు ఉండేవాళ్ళు. వాళ్ల తండ్రి ఒకరోజున వాళ్లు ముగ్గురినీ పిలిచి, "ఒరే! నేను ముసలివాణ్ని అయిపోయాను. ఇవాళ్ళో రేపో చనిపోతాను. అందుకని మనకున్న ఆస్తులన్నీ మీ ముగ్గురికీ సమానంగా పంచుతున్నాను. కలిసి ఉండండి, ఒకరికొకరు సహకరించుకోండి, ముగ్గురూ అభివృద్ధిలోకి రండి" అని ముగ్గురికీ సమాన భాగాలు పెట్టాడు. అనుకున్నట్లుగానే కొద్దిరోజులలో ఆయన కన్నుమూశాడు. అన్నదమ్ముల్లో చిన్నవాడు కొంచెం అమాయకుడు. అవకాశం కోసమే ఎదురుచూస్తున్న అన్నలిద్దరూ తమ్ముణ్ని కొట్టి తరిమేశారు. వాడి ఆస్తిని కూడా తామే

తీసుకున్నారు. అమాయకుడైన చిన్నవాడు ఏమీ అనలేదు. 'మంచివాళ్లను దేవుడే కాపాడుతాడు' అని ఊరి ప్రక్కన వున్న అడవిలో కట్టెలు కొట్టుకొని జీవించటం మొదలుపెట్టాడు.



ఒకరోజున అతను కట్టెలు కొట్టుకొంటుండగా ఒక పావురం అరుపు వినిపించింది. దానికి ఏదో దెబ్బ తగిలినట్లుంది, దీనంగా అరుస్తున్నది. చిన్నవాడు వెళ్ళి చూసే సరికి, దాని కాలునుండి రక్తం కారుతున్నది. స్వతహాగా సున్నిత మనస్కుడైన తమ్ముడు దాన్ని చూసి జాలిపడ్డాడు. దాన్ని చేతిలోకి తీసుకొని, కాలికి గుడ్డకట్టి, తినేందుకు గింజలు వేసి, ప్రమాదాల బారిన పడకుండా ఎత్తుగా ఉంచి కాపాడాడు. మూడు నాలుగు రోజుల్లో ఆ పావురం ఆరోగ్యం కుదురుకున్నది. అది సంతోషంగా రెక్కలాడిస్తూ ఎగిరిపోయింది.

మరుసటి రోజున ఆ పావురం ఒక దోస గింజను పట్టుకొచ్చి చిన్నవాడి ఇంటిలో వేసి వెళ్ళిపోయింది. 'పావురం అంత ఇష్టంగా తెచ్చి ఇచ్చింది కదా' అని సంబరపడి, అతను ఆ గింజను తలుపు ప్రక్కగా నాటి నీళ్ళు పోసాడు. తెల్లవారి లేచి తలుపు తెరిస్తే రావటంలేదు! గట్టిగా లాగాడు- ఆశ్చర్యం! దోసతీగ ఒక్కరోజులో మొలిచి, పెద్దదై, ఇంటి చుట్టూ అల్లుకున్నది; నిండుగా కాయలు కూడా కాసింది! ఇంటి చుట్టూతానే కాదు; ఇంటి మీద కూడా- దోసతీగ అల్లుకుని నిండుగా దోసకాయలు కాసి ఉన్నది!

"ఆహా! బలే తొందరగా పెరిగిందే! ఏమి రకమో చూడాలి" అని తమ్ముడు ఒక దోసకాయని కోసి చూసాడు. చూడగా ప్రతి

దోసకాయ లోపలా బంగారం! తమ్ముడు చాలా సంతోషపడి, దోసకాయలన్నీ కోసి పెట్టుకొన్నాడు. వాడు అమాయకుడు కదా, అందుకని అన్నలమీది అభిమానంతో కొన్ని కాయలు పట్టుకొని వాళ్ళ ఇంటికి వెళ్ళాడు. అయితే అన్నలు వాడిని చూడగానే ఆస్తిలోవాటా అడుగుతాడని అనుమానపడి, బయటే నిలబెట్టి మాట్లాడారు. సరేలెమ్మని, వాడు తలా రెండు కాయలు ఇచ్చేసి వెనక్కి తిరిగాడు.

అన్నలిద్దరూ ఆ కాయల్ని ఇంట్లోనే ఓ మూలకి పడేసి ఊరుకున్నారు.

ఆలోపల తమ్ముడు తన దగ్గరున్న కాయల్లో మూడు నాలుగు కాయలు కోసి, వాటిలోని బంగారం అమ్ముకొని, ఇంటికి అవసరమైన వస్తువులన్నీ కొన్నాడు. ఆ వస్తువులన్నీ తమ్ముడి ఇంటి ముందు దిగటం చూసేసరికి అన్నలిద్దరికీ అనుమానం వచ్చింది. అప్పుడు వాళ్ళు తమ్ముడిచ్చిన కాయలు కోసి చూస్తే, వాటినిండా బంగారం!

వెంటనే వాళ్ళు ఇద్దరూ తమ్ముడి దగ్గరికి వెళ్ళి "ఇవి నీకెక్కడివిరా?" అని అడిగారు. తమ్ముడు జరిగిందంతా పొల్లు పోకుండా చెప్పాడు.

అది విన్నాక వాళ్ళకు నిద్రపట్టలేదు. పెద్దవాడు రెండవ వాడిని అడవిలోకి పంపి, "ఎలాగైనా నువ్వు ఆ కాళ్ళు విరిగిపోయిన పావురాన్ని తీసుకొని రావాలిరా, తమ్ముడూ" అని చెప్పాడు. అతను వెళ్ళి అడవికి వెళ్ళి చూస్తే అసలెక్కడా అలా కాళ్ళు విరిగి పోయిన పావురం కనపడలేదు. అప్పుడు అతను కొంచెం ఆలోచించి, ఒక రాయి తీసుకొని దగ్గర్లో చెట్టుమీద కూర్చొని ఉన్న ఓ పావురం మీదికి బలంగా వేసాడు. అది రాయి తగిలి పడిపోగానే, వాడు దాన్ని తీసుకొని ఇంటికి వెళ్ళి అన్నకి చూపించాడు.

పావురం ఎగిరిపోదామని తన్నుకుంటున్నది. అన్నలిద్దరూ కలిసి దాన్ని గట్టిగా పట్టుకొని, గాయానికి కట్టు కట్టారు. అన్న అన్నాడు, "ఒరే, మనం దీన్ని వదిలామంటే ఇది ఎగిరిపోయి, ఇక మళ్ళీ రాదు; అందుకని దీన్ని పంజరంలో పెడదాం ఆగు" అని. సరే అని

వాళ్ళు ఇద్దరూ దాన్ని పంజరంలో పెట్టి మూడు రోజులు అసలు పట్టించుకోకుండా వదిలేశారు. నాలుగో రోజున పంజరం తలుపులు తెరిచి చూశారు 'అది ఎలా ఉంద'ని.



మూడు రోజుల పాటు ఆకలితో నకనకలాడిన పావురం వాళ్ళు పంజరం తలుపులు తెరవగానే ఎగిరిపోయింది. అన్నలిద్దరూ 'అయ్యో' అనుకొని చూసేసరికి, పంజరంలో వాళ్లకూ ఒక దోస గింజ కనబడ్డది. దాన్ని చూడగానే వాళ్లకు ప్రాణం లేచి వచ్చినట్లయింది. ఇద్దరూ కలిసి ఆ గింజను నేలలో నాటి, రాత్రంతా నిద్రపోకుండా కాపలా కాశారు.

ఆశ్చర్యం! తమ్ముడికి ఎలా జరిగిందో అలాగే జరిగింది- తెల్లవారేసరికల్లా ఒక పెద్ద దోసతీగ ఇంటి చుట్టూ అల్లుకొని ఉన్నది!

"నేను ముందు కోస్తా! నేను ముందు కోస్తా!" అని పోట్లాడుకొని వాళ్ళిద్దరూ గబగబా కాయలన్నీ కోసుకొని ఇంట్లో కుప్ప చేసారు. "చూడనివ్వురా, ఒక్కోదాంట్లో ఎంత బంగారం ఉందో!" అని వాళ్ళు ఆ కాయల్ని కోసి చూస్తే ఏముంది- ప్రతి కాయలోనూ పాములు తేళ్ళు ! ఆ పాములు, తేళ్ళు వెంటపడి తరిమేసరికి అన్నలిద్దరూ ఊరువిడిచిపెట్టి పారిపోవాల్సి వచ్చింది!

సుబ్బయ్య: చక్కని ఉడిపి హోటల్ ని మూసేసి చైనీస్ ఫుడ్ కోర్టు పెట్టావేంటిరా?
రామయ్య: ఏం లేదురా, ఉప్మా రవ్వ నిండా పురుగులు ఉంటుంటేనూ, వాటిని ఏరలేక అలా పేరు మార్చానంతే. ఇప్పుడు జనాలు ఏది పెట్టినా ఎంచక్కా తినేస్తున్నారు చూడు!



# మంత్రగత్తె ఏది?

*రచన: సౌమ్య, 8 వ తరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా*

ఆ రోజు సోమవారం. ఉదయం ఎనిమిదిగంటలకు సౌమ్య పుస్తకాల సంచి తీసుకొని బడికి బయలుదేరింది.

దారిలో సోము అనే కోతి కలిసింది సౌమ్యను. అది, సౌమ్య ఎప్పటినుండో స్నేహితులు.

"మనం అడవిలోకి వెళ్దామా? రకరకాల పండ్లు కోసుకొని తినచ్చు?!" అడిగింది సోము.

"సరే, వెళ్దాం. కానీ ఇంటర్వెల్ లో పండ్లరసాలు త్రాగి వచ్చేందుకు చిన్న విరామం ఇస్తారు కదా, అప్పుడు వెళ్దాం!" అని చెప్పింది సౌమ్య.

విరామ సమయం అవ్వగానే సౌమ్య అక్కకి చెప్పింది- "నేను నీళ్ళు త్రాగి వస్తానక్కా" అని. "దానిదేముంది, వెళ్ళి త్రాగిరా" అన్నది అక్క.

అంతే, సౌమ్య సోముని వెంటబెట్టుకొని అడవిలోకి పరుగెత్తింది.

అడవిలో పండ్లను కోసుకుంటూ, తింటూ ఒక కొండమీదికి చేరుకున్నారు సౌమ్య, సోము. అక్కడ వాళ్లకు ఒక పాత గుడి కనబడింది.

"అరే, ఈ గుడి ఎక్కడినుండి వచ్చింది?! ఇన్నేళ్ళుగా నేను ఇక్కడే ఉన్నాను; అయినా ఇదిఎప్పుడూ కనబడనే లేదు!" ఆశ్చర్యపోయింది సోము.

సౌమ్యకూడా ఆ గుడిని ఎప్పుడూ చూడలేదు. కానీ తనకు అన్నీ తెలిసినట్లు పోజు పెట్టింది. "లోపలికి వెళ్దాం పద!" అన్నది.

ఇద్దరూ ఆ గుడిలోకి వెళ్ళారు. గుడి లోపల చాలా చీకటిగా ఉన్నది. దారి అస్సలు కనబడటమే లేదు. దాంతో సోముకి భయం వేసి, వెంటనే బయటకి వచ్చేసింది.

సౌమ్యకి కూడా చాలా భయం వేసిందిగానీ, సోము ముందు పోజు కొట్టాలని, అలాగే ముందుకి వెళ్ళింది.

గుడి మధ్యకు చేరుకునే సరికి, సౌమ్య కాళ్ళకు ఏదో చుట్టుకున్నది. నడుముకు ఏదో అడ్డం వచ్చింది. చేతులు రెండూ కలిపి కట్టబడ్డాయి! తనకు తెలీకుండానే ఏదో ఉచ్చులో చిక్కుకుంది సౌమ్య. ఆ పాపకు చాలా భయం వేసింది. బిగ్గరగా కేకలు వేసింది.

ఆ కేకలు బయట ఉన్న సోముకు వినబడలేదు గానీ, అక్కడ ఉచ్చును బిగించిన మంత్రగత్తెకి మాత్రం బాగా వినబడ్డాయి.

ఆ మంత్రగత్తె గబుక్కున అటు తిరిగి వచ్చి, ఉచ్చులో చిక్కుకున్న సౌమ్యని చూడగానే "హ్హా హ్హా హ్హాహ్హా హ్హా" అని బిగ్గరగా నవ్వింది. "నువ్వు చాలా చిన్నగా, లేతగా ఉన్నావు పిల్లా, నిన్ను కొరుక్కొని తింటే చాలా బాగుంటుంది. కానీ నీవల్ల కావాల్సిన పని ఒకటి ఉంది- ఏం చేసేది? ఆ పనైనాక, కావాలంటే అప్పుడు తింటాను నిన్ను" అంది.

సౌమ్యకి ఏడుపు వచ్చింది. "అక్కకి అబద్ధం చెప్పి వచ్చినందుకు తగిన శాస్తి అయ్యింది. ఇప్పుడు ఎట్లాగోఒకలాగా తప్పించుకోగలిగితే బాగుండు. ఇంకెప్పుడూ అక్కకి అబద్ధం చెప్పను" అని ఏడిచింది.

"ఊరికే ఏడవకు పిల్లా, గుడి లోపలికి పో. అక్కడ అమ్మవారి వేలికి ఒక ఉంగరం ఉంటుంది. దాన్ని నేను సొంతగా తీసుకోలేను- నీలాంటి మంచి పిల్లలే దాన్ని తీయగలరు. దాన్ని తెచ్చి నాకు ఇచ్చావంటే, నిన్ను వదిలేయటం గురించి ఆలోచిస్తాను నేను- జాగ్రత్త, ఇక్కడ అంతా పాములు తిరుగుతున్నాయి- దొంగ వేషాలు వెయ్యకు. నేరుగా లోపలికి పో" అన్నది మంత్రగత్తె.

"నేను పోను" అని అరుద్దామనుకున్నది సౌమ్య. కానీ ఏం ప్రయోజనం? వేరే దారి లేదు కదా? అందుకని మారు మాట్లాడకుండా గర్భగుడి లోపలికి పోయింది. అక్కడ అమ్మవారి విగ్రహం పెద్దగా నిలబడి ఉన్నది. సౌమ్య అమ్మవారి వేలికి ఉన్న ఉంగరాన్ని తీసుకొని తన గుప్పిట్లో పెట్టుకొని వెనుకకు తిరిగింది. అంతలోనే సోము మాటలు వినబడ్డాయి పైనుండి- పైన ఉన్న కన్నంలోంచి చూస్తున్నది అది!

"ఏం చేయబోతున్నావు ఉంగరాన్ని?! మంత్రగత్తెకు ఇవ్వకు! దాన్ని రుద్ది, తుడిచి, కడిగి- ఇంకేదైనా చేసి చూడు- దానిలో ఏముందో చూడకుండా ఊరికే మంత్రగత్తెకు ఇచ్చేస్తే ఎలాగ?" గుసగుసగా అన్నది సోము.

"అవునవును- దీనిలో ఏదో శక్తి ఉండే ఉంటుంది" అని ఉంగరాన్ని పెట్టుకొని దాన్ని గబగబా రుద్దింది సౌమ్య.

వెంటనే ఉంగరంలోంచి పెద్దగా పొగ వచ్చింది. చూస్తూండగానే ఆ పొగలోంచి ఒక భూతం వచ్చింది. "నమస్కారం పాపా! నేను ఈ ఉంగరం భూతాన్ని! నీకు ఏదైనా ఒక మేలు చేస్తాను. అడుగు" అన్నదా భూతం, వంగి సౌమ్యకు నమస్కరిస్తూ.

"నన్ను ఈ మంత్రగత్తె నుండి రక్షించి మా బడికి చేర్చు" అడిగింది సౌమ్య.

"ఎంత చిన్న కోరిక కోరావు! ఒక్క క్షణంలో నెరవేరుస్తాను. కళ్ళు మూసుకో ఒక్క క్షణం!" అని ఉంగరం భూతం సౌమ్యను అక్కడినుండి మాయం చేసి వాళ్ల బడిలోకి చేర్చి వదిలింది.

ఎంతో సేపటినుండి సౌమ్యకోసం వెతుకుతున్నారు వాళ్ల స్నేహితులూ,

అక్కానూ. వాళ్లంతా సౌమ్యను చూడగానే తన చుట్టూ మూగి ప్రశ్నల వర్షం కురిపించారు- సౌమ్య జరిగిందంతా చెబితే వాళ్లంతా బిగ్గరగా నవ్వారు- "భలే చెబుతున్నావే, కొత్తపల్లి కథలాగా?!" అన్నారు.

"కాదు, నిజం! కావాలంటే ఇదిగో చూడండి, ఉంగరాన్ని!" అని మూసి ఉన్న తన గుప్పిటిని తెరిచింది సౌమ్య. అందులో ఉంగరం లేదు!

పిల్లలందరూ మళ్ళీ నవ్వారు. "భలే కల వచ్చినట్లుంది సౌమ్యకి!" అన్నారు.

"కావాలంటే సోము వచ్చాక అడుగుదాంలే. అయినా ఆ మంత్రగత్తె బెడద తప్పింది- అంతే చాలు" అనుకొని, నవ్వి ఊరుకున్నది సౌమ్య.

అయితే పెద్దయ్యాక ఎన్నిసార్లు ఆ కొండ ఎక్కినా మళ్ళీ సౌమ్యకు గుడి కనబడలేదు; మంత్రగత్తె కూడా కనబడలేదు; ఉంగరమూ దొరకలేదు!

టీచర్: చింటూ బల్బుని కనిపెట్టిన వాడు, కరెంటుని కనిపెట్టిన వాడు- వీళ్ళిద్దరిలో ఎవరు గొప్ప?

చింటూ: ఇద్దరూ కాదు, స్విచ్‌ను కనిపెట్టిన వాడు గొప్ప! ఎందుకంటే వాడు లేకపోతే కరెంటు ఐపోతుంది, బల్బులు మాడిపోతాయి!

సుబ్బు: ఏంట్రా! గులాబి, జామ మొక్కల్ని ఒకే దగ్గర కలిపి నాటుతున్నావెందుకు?

వెంగళప్ప: రెండూ కలిపి నాటితే చెట్టు పెద్దయ్యాక గులాబ్‌జామ్‌లు కాస్తాయని!

వెంగళప్ప: ఎన్నడూ బిజీగా ఉండని టెలిఫోన్ నంబర్ ఏదో కనుక్కో?

సుబ్బారావు: తెలీదురా!

వెంగళప్ప: ఆ మాత్రం తెలీదా? రాంగ్ నంబరు!

# దొర్లు దొర్లు పుచ్చకాయ్

*కథనం: హెచ్.ఆర్.కార్తిక, 4 వ తరగతి, శ్రీ చైతన్య చిల్డ్రన్స్ అకాడమి, రాజంపేట, కడపజిల్లా.*



ఒక ఊరిలో ఒక పొట్టేలుండేది. అది రోజూ ఊరి బయట కెళ్లి మేతమేసి వచ్చేది. ఒకసారి ఆ ఊరిలో కరువొచ్చింది. మనుషులకే కాదు, పశువులకు కూడా తిండి దొరకడం కష్టమైంది. అలా తిండి దొరకక పొట్టేలు బక్కచిక్కి పోయింది.

ఆ ఊరికి కొంతదూరంలో ఒక అడవి ఉంది. ఆ అడవిలోకి తిండి కోసం బయలుదేరింది పొట్టేలు. దారిలో ఒకనక్క ఎదురైంది దానికి. నక్కకు పొట్టేలును చూడగానే నోట్లో నీరూరింది. "పొట్టేలు బావా... పొట్టేలు బావా... నిన్ను తినాలనిపిస్తోంది" అంది.



దానికా పొట్టేలు బాగా ఆలోచించి, "నక్క బావా, నక్కబావా! ఇప్పుడు నాలో ఎముకలు తప్ప, కండలు లేవు. చాలా రోజుల నుండి తిండి తినక, సగానికి సగం చిక్కిపోయాను. నన్నొదిలేస్తే నల్ల కొండకు వెళ్లి నాలుగాకులు, ఎర్రకొండకు వెళ్లి ఏడాకులు, పచ్చకొండకు వెళ్లి పదాకులు మేసి, బాగా బలిసి వస్తాను- అప్పుడు తిందువుగానిలే"

అంది. "అలాగా.... ఐతే తొందరగా పోయి, బాగా బలిసిరా, పో!" అని దాన్ని విడిచిపెట్టింది నక్క.



బ్రతుకుజీవుడా అని పొట్టేలు కాస్త దూరం వెళ్ళిందో లేదో- ఈసారి ఒక పులి ఎదురు వచ్చింది. అది ఒక్క ఉదుటున ఎగిరి పొట్టేలును పట్టుకొని- "పొట్టేలు బావా, పొట్టేలు బావా! నిన్ను తినాలనిపిస్తోంది" అన్నది. దానికా పొట్టేలు "పులి బావా-పులిబావా ! ఇప్పుడు నాలో ఎముకలు తప్ప కొవ్వు అస్సల్లేదు. నన్నొదిలేస్తే నల్ల కొడకు వెళ్లి నాలుగాకులు, ఎర్ర కొండకు వెళ్ళి ఏడాకులు, పచ్చ కొండకు వెళ్ళి పదాకులు మేసి , బాగా బలిసి వస్తా. అప్పుడు తిందువు గానిలే " అంది. "అలాగా! అయితే తొందరగా పోయి, బాగా బలిసి రా- పో!" అని దాన్ని విడిచిపెట్టింది పులి.



"హమ్మయ్య" అనుకుంటూ వేగం పెంచి కాస్త దూరం వెళ్లిందో లేదో- అంతలోనే ఈసారి ఒక సింహం ఎదురొచ్చింది. "పొట్టేలు బావా,పొట్టేలు బావా! నిన్ను తినాలనిపిస్తోంది!" అంది. దానికా పొట్టేలు "సింహం బావా- సింహం బావా ! ఇప్పుడు నాలో ఎముకలు తప్ప కొవ్వు అస్సల్లేదు కదా. అందుకని నన్నొదిలేస్తే, నల్ల కొండకు వెళ్లి నాలుగాకులు, ఎర్ర కొండకు వెళ్ళి ఏడాకులు, పచ్చ కొండకు వెళ్ళి పదాకులు మేసి , బాగా బలిసి వస్తా.

అప్పుడు తిందువు గానిలే " అంది. "ఓహో అలాగా! అయితే తొందరగా పోయి, బాగా బలిసి రా-పో!" అని దాన్ని విడిచిపెట్టింది సింహం.



అట్లా నక్కను, పులిని, సింహాన్ని తప్పించుకొని పొట్టేలు కాస్తా నల్లకొండకు వెళ్లింది- నాలుగాకులు మేసింది. ఎర్రకొండకు వెళ్లింది- ఏడాకులు మేసింది. పచ్చకొండకు వెళ్లింది- పదాకులు మేసింది. బాగా బలంగా తయారై, తిరుగు ప్రయాణం పట్టింది.

కానీ దారిలో సింహం, పులి, నక్క ఎదురు చూస్తుంటాయి కదా తనకోసం? వాటినెలా తప్పించుకోవాలి ?" అని ఆలోచించి, అక్కడే ఉన్న ఓ పెద్ద పుచ్చకాయలో దూరిందది. పుచ్చకాయలో దూరి, "దొర్లు దొర్లు పుచ్చకాయ్ దొర్లకుంటే దోసకాయ్" అను కుంటూ, దొర్లుకుంటూ వెళ్లింది. అలా దొర్లుతూ ఉంటే దారిలో సింహం ఎదురై "ఇదేంటి, ఇలా దొర్లుతూ ఉందే?!" అని దానిని కాలితో వేగంగా తన్నింది. దాంతో పుచ్చకాయ మరింత వేగంగా ఉరకడం మొదలెట్టింది.



మరి కాస్త దూరం వెళ్లాక పులి ఎదురైంది. అది కూడా "ఏంటబ్బా! ఇదేదో కాయ, భలే దొర్లుతూ ఉందే ?" అని, కాలితో ఈడ్చి ఒక తన్ను తన్నింది. దానితో పుచ్చకాయ మరింత వేగంగా ఉరకడం మొదలెట్టింది.



అలా ఇంకొం చెం దూరం వెళ్ళగానే నక్క ఎదురైంది. పులి, సింహంలా కాదు- నక్క తెలివైంది. కనుక "ఈ పుచ్చ కాయేంటి, ఇలా దొర్లడమేంటి? దీని సంగతి కనుక్కోవాలి" అని దాని వెంటే ఉరకడం మొదలు పెట్టింది. పుచ్చకాయలో ఉన్న పొట్టేలు తన వెనకే నక్క రావడం చూసి, 'దానికి దొరకూడదు' అనుకొని, "దొర్లు దొర్లు పుచ్చకాయ్! దొర్లకుంటే దోసకాయ్!" అనుకుంటూ మరింత వేగంగా దొర్లింది. అట్లా కొంత దూరం పోగానే దారిలో దానికి ఒక పెద్ద బండ రాయి అడ్డ మొచ్చింది, దానికి. పుచ్చకాయ వేగంగా వెళ్లి బండరాయికి కొట్టుకుంది: అంతే- ఆ దెబ్బకు అది ఫట్ మని పగిలి రెండు ముక్కలైంది! పొట్టేలు కాస్తా బయటపడింది!



పొట్టేలును చూడగానే నక్క ఇకిలిస్తూ "అమ్మ దొంగా! నువ్వా, లోపలుంది? నన్నే తప్పించుకొని పోదామనుకున్నావా?" అని ఎగిరి దాన్ని పట్టుకుంది. అప్పుడా పొట్టేలు "అది కాదు నక్క బావా! నీ దగ్గరకు వస్తూ ఉంటే, దారిలో నాకు బాగా ఆకలేసింది. దారిలో కుందేలు వారింట్లో పెళ్ళి భోజనాలు ఏర్పాట్లు జోరు జోరుగా జరుగు తున్నాయి కదా- వడలు, పాయసాలు వద్దన్నా

కొసరి కొసరి వడ్డించారు. అవన్నీ తినేసాక, నా పొట్ట ఎంత నిండిపోయిందంటే, ఇంక నీ దగ్గరకు వచ్చేందుకు నేను నడవనేలేక పోయాను. అందుకే ఇలా పుచ్చకాయలో దూరి, దొర్లుకుంటూ వచ్చాను. బాగున్నావుగా?" అని నమ్మ బలికింది.

ఈ మాటలు వినే సరికి నక్క బావకి నోరూరింది. నక్క మనసులో భావం గ్రహించి పొట్టేలు వెంటనే అన్నది- "నక్క బావా! నేను ఎక్కడికీ పోనులే, నన్ను రేపు అయినా తినొచ్చు. ముందు నువ్వు వెళ్ళి కుందేలు ఇస్తున్న పెళ్ళి విందు ఆరగించిరా" అని విందు జరిగే చోటు చెప్పింది. నక్క సంబరపడిపోయి, పొట్టేలు చెప్పిన చోటుకు చేరుకుంది. తీరా చూస్తే అక్కడ నిజంగా ఏ విందూ లేదు- అది పులి నివసించే గుహ! నక్క ఆ గుహలో అడుగు పెట్టిందో లేదో, బాగా ఆకలిగొని ఉన్న పులి నక్కమీదికి ఉరికి, దాన్ని పట్టుకొని లొట్టలేసుకుంటూ తినేసింది.

ఇంకేముంది, పొట్టేలు బతికి పోయింది- "ఇంకెప్పుడూ అడవిలో అటువైపుకు వెళ్ళను స్వామీ" అని దండంపెట్టుకున్నది గుమ్మడికాయకి.

నవ్వండి!

**ఎవరినో కనుక్కోండి!**

రాము: పొద్దున్న మా ఆవిడకీ నాకూ పెద్ద యుద్ధమైపోయిందిరా!

సోము: ఏం చేశావు?

రాము: నాకు తిక్కరేగితే ఊరుకుంటానా? సుబ్బరంగా చితక్కొట్టేశాను!

సోము: అయ్యో! మరి మీ ఆవిడ తిరగబడలేదా!?

రాము: లేదురా! నేను చితక్కొట్టింది వంటింట్లో సామాన్లని!!

**తరగని ఆస్తులు!**

విశ్వనాథం: మీ నాన్నగారు పోయారటకదా పాపం! చనిపోయేముందు ఏమైనా అప్పగించారా?

వీరభద్రం: అప్పగించారండి, మా అన్నయ్యకి 5లక్షలు, నాకు4లక్షలు, మా తమ్ముడికి 3లక్షలు-

విశ్వనాథం: ఎంతైనా ముందు చూపున్నవాడు మీనాన్న! ఆస్తిరూపంలో ఇచ్చాడా, డబ్బురూపంలోనా?

వీరభద్రం: అప్పురూపంలో ఇచ్చాడండి!



# మారిన శివునాజ్ఞ

*ఆవులూ ఎద్దులూ మనకి ఎందుకు సేవ చేస్తున్నాయో చెప్పే భలే కథ ఇది. దీన్ని చదివాక ఆవుల గురించీ, ఎద్దుల గురించీ, మన అలవాట్ల గురించీ, శివుడి గురించీ, శివునాజ్ఞ గురించీ కూడా ఆలోచించచ్చు...!*

*రచన: రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

పూర్వం భూలోకంలో ఆవులు, ఎద్దులు ఉండేవి కావు. కైలాసంలో ఉండే శివుడికి వాహనంగా ఉండేది ఎద్దు. ఆవు, ఎద్దుకి భార్య కదా, అందుకని అది కూడా మరి అక్కడే ఉండేది. సరే, అప్పుడేమైందంటే, బ్రహ్మదేవుడు మానవులందర్నీ సృష్టించి, "భూలోకంలో ఈ మానవులంతా ఎలా జీవించాలో, వాళ్ళు పాటించవలసిన నియమాలు ఏమిటో నువ్వే చూసుకోవాలి ఈశ్వరా!" అన్నాడు.

"సరేలే, నేను ఆలోచించి చెబుతాను వాళ్లందరికీ!" అన్నాడు శివుడు. ఇక ఆనాటి నుంచీ ఆయన శ్రద్ధగా ఆలోచించి,

మానవులంతా పాటించవలసిన నియమాలను ఒక్కటొక్కటిగా దండోరా వేయించసాగాడు తన వాహనమైన ఎద్దుతో.

ఒక రోజు ఎద్దుని పిలిచిన శివుడు, "బసవన్నా! భూలోకంలో ప్రజలంతా ఎంత కంపు కొడుతున్నారో చూశావు కదా?! అందుకని నువ్వు ఈ రోజే భూలోకానికి వెళ్ళి దండోరా వేసిరావాలి- 'మానవులంతా మూడు పూటలా స్నానం చేయాలి; ఒక పూట తిండి తినాలి ' ఈ సంగతి అందరికీ చెప్పిరా, పో. వెంటనే వెళ్ళు!" అని అజ్ఞాపించాడు.



"అలాగే దేవా!" అంది ఎద్దు.

అయితే దానికి ఆ రోజున ఎక్కడికీ వెళ్ళాలని లేదు. ఇంటి దగ్గర తన భార్య ఆవు పచ్చి గడ్డి పచ్చడి, జొన్న కంకుల పప్పు, సజ్జ రొట్టెలు చేస్తోంది: దాని మనసంతా తిండి పైనే ఉంది. ఒక్క క్షణం పాటు అది "ఇవాళ్ల వెళ్ళనులే, రేపు వెళ్తాను" అనుకున్నది. కానీ అది కుదరదు- శివునాజ్ఞను నెరవేర్చాల్సిందే!

'సరే , ఏం చేస్తాం?! త్వరత్వరగా వెళ్ళి భూలోకంలో ఈ చిన్న దండోరా వేసి వచ్చేస్తే సరి- హాయిగా మంచి భోజనం చేయచ్చు ' అనుకొని వడివడిగా భూలోకం చేరింది ఎద్దు.

"అందరూ వినండహో! శివునాజ్ఞ - ఇది శివునాజ్ఞహో! -ఇకనుండీ ప్రతి ఒక్కరూ మూడు పూటలా తినాలహో; ఒక్క పూట స్నానం చేయాలహో! అందరూ గుర్తుంచుకోండహో! ఇది శివునాజ్ఞహో! మీరరానిదహో!" అని అరుస్తూ, డప్పు కొట్టుకుంటూ తిరిగి తిరిగి అందరికీ చెప్పింది ఎద్దు. ధ్యాసంతా ఇంటిమీదా, భార్య చేసిన వంట మీదా ఉన్న ఎద్దుకి తను చేసిన తప్పు తెలియనేలేదు కైలాసం చేరేదాకా!

కోపంగా చూస్తూ ద్వారంలోనే నిలబడి ఉన్నాడు శివుడు! ఆయన వెనకగా నిలబడి దిగులుగా చూస్తోంది పార్వతమ్మ. చేతులు నలుపుకుంటూ ఆందోళన పడుతోంది ఆవమ్మ.



ఏం జరిగిందో అర్థం కాక అయోమయంగా వారి వైపు చూసింది ఎద్దు.

"ఒక పూట తిని మూడు పూటలా స్నానం చేయమని చెప్పి రమ్మంటే, మూడు పూటలా తిని ఒక పూట స్నానం చేయాలని దండోరా వేసి వస్తావా?" అన్నాడు శివుడు మండిపడుతూ.

నాలిక్కరుచుకున్నది ఎద్దు- "క్షమించండి దేవా!" అంది.

"క్షమించాలా? ఇది ఎంత పెద్ద తప్పో తెలుసా?! దీన్ని ఇక ఎవ్వరూ మార్చలేరు! ఈ తప్పుకి నువ్వే బాధ్యత వహించాలి, తప్పదు!" అన్నాడు శివుడు.

"ఏం చేయమంటే అది చేస్తాను. శలవియ్యండి స్వామీ! అంది ఎద్దు- "ఆఁ..ఏముంది, మళ్ళీ దండోరా వేసి రమ్మంటాడు అంతే కదా! అంతగా అయితే భోజనం చేసాక వెళ్ళి చెప్పి రావచ్చు" అని మనసులో అనుకుంటూ.

"నువ్వు నీ భార్య బిడ్డలతో సహా శాశ్వతంగా భూలోకంలోనే ఉండు. మానవులున్నంత కాలం నువ్వు, నీ బిడ్డలు-బిడ్డల బిడ్డలు- అలా అందరూ పొలాలు దున్ని, మానవులకి మూడు పూటలకీ కావలసిన ఆహారాన్ని సమకూరుస్తూ జీవించండి!" అని శపించి, 'ఇంకేమీ మాట్లాడేది లేదు' అన్నట్లుగా విసవిసా నడుస్తూ లోపలికి వెళ్ళిపోయాడు శివుడు.

ఆయన్ని అనుసరించింది పార్వతమ్మ.

ఎద్దు అవాక్కయ్యింది. 'అయ్యో! మారిన శివునాజ్ఞని శివుడు కూడా మార్చలేదే!'అనుకున్నది.

అయినా చేసేదేమున్నది? భార్య పెట్టిన భోజనాన్ని ఇష్టంగా తినేసి, అటుపైన కాపురాన్ని భూలోకానికి తరలించింది.

అప్పటి నుండీ అది భూలోకంలోనే ఉంటూ, పాపం మన పొలాలని దున్ని పంటలు పండిస్తోంది.

తన భర్తకు సహాయపడాలని, ఆవు పాలని ఇస్తోంది. అదన్నమాట సంగతి!

## గురువులు మీరే (పాట)

రచన: శ్రీ. SSS రావు గారు.

*గానం: మంజునాథ్, నారాయణమ్మ, 6 వ తరగతి, MPUPS-బద్దలాపురం*

గురువులు మీరే జ్ఞాన తరువులు మీరే
విద్య దానం చేసి జ్ఞానవంతులు చేసే
పరమ పూజ్యులు మీరే
అపర బ్రహ్మలు మీరే "గురువులు"
బలపం పట్టి రాతను నేర్పే
బతుకులు మార్చే బాధ్యత మీదే
పగలూ రాత్రి వెలుగూ నిచ్చే
సూర్యులు మీరే- వెలుగుదివ్వెలు మీరే

ఫలమును ఇచ్చే తరువులకన్నా
దూరదృష్టినిచ్చే గురువులు మిన్న
ఫలితం కొరకు ప్రాకులాడని
వ్యక్తులు మీరే- దివ్యశక్తులు మీరే "గురువులు"
మంచిని పెంచే మార్గం చూపే
చెడునూ తుంచే కంచెను వేసే
రక్షణ మీరే- మా బాధ్యత మీదే
మంచి మార్గం చూపే వేగుచుక్కలు మీరే గురువులు"



# నీళ్లతో మంటలు!



*రచన: శ్రీ యస్.శంకర శివ రావు, ఇంద్రజాలికులు/ఉపాధ్యాయులు, యంపియుపియస్, బద్దలాపురం, కనగానపల్లి మండలం, అనంతపురం జిల్లా.*

పొడరాళ్ళపల్లి- అక్కమ్మకొండలో గుండుదోన క్రింద ఓ మర్రిమాను. మధ్యాహ్నం పూటల్లో పశువుల కాపర్లు పశువులకు నీళ్ళు తాపాక, వాటిని ఆ మర్రిమాను కిందే వదిలి కొంతసేపు విశ్రాంతిగా పడుకుంటారు. మూడు వారాల నుండి ఆ చెట్టుక్రింద ఒకాయన కనబడుతున్నాడు- కాషాయవస్త్రం; తెల్లటిగడ్డం- జుట్టేమో అట్టలుకట్టి, తలపాగాలాగా చుట్టుకుని ఉన్నది. ఎవరో సాధువు అన్నమాట- కళ్ళు మూసుకుని ఉన్నాడు; అన్నం తినడు; ఎప్పుడో ఒకసారి లేచి, చెలమలోని నీళ్ళు త్రాగి, మళ్ళీ ధ్యానంలో కూర్చుంటాడు. ఆయన వింత దినచర్య సంగతి పశువుల కాపర్ల ద్వారా అన్ని

పల్లెలలోనూ తెలిసింది.

ప్రజలు రావటం మొదలుపెట్టారు. మొక్కుతున్నారు; టెంకాయలు, పూలు సమర్పిస్తున్నారు. సాధువు కొందరివైపు చూడడు. కొందరినేమో పేరు పెట్టి పిలుస్తాడు. కొందరికి తనకు తోచిందేదో చెబుతాడు. చలమయ్య, విరుపాక్షి, హనుమంతులు ఆయనకి అక్కడే ఓ చిన్న కుటీరం నిర్మించారు. త్వరలోనే భక్తుల సౌకర్యార్థం కాలిబాట కాస్తా రోడ్డుగా మారింది. ఇప్పుడు ఆ రోడ్డు మీద వాహనాలు తిరుగుతున్నాయి. మర్రిమాను పరిసరాల్లో నీటి సౌకర్యం ఏర్పడింది. సత్రాలు తయారయ్యాయి. సాధువుతో పాటే రాత్రిళ్ళు కొంత మంది భక్తులు నిద్రిస్తున్నారు.

ఆయన చెప్పిందల్లా జరుగుతున్నదని ప్రచారం మొదలైంది. భక్తులు కానుకలు ఇవ్వటం, సాధువు చుట్టూ ఉన్న శిష్యులు వాటిని అందుకోవటం జరుగుతున్నది. ఆయన శిష్య బృందం త్వరలోనే బాగా పెద్దదయింది. సాధువు కాస్తా స్వామీజీ అయ్యారు. స్వామీజీకి రాని విద్య అంటూ లేదు. వైద్యం, జ్యోతిషం, వాస్తు- ఏదంటే అది చెబుతాడాయన. ఇవన్నీ ఒక ఎత్తు; దోష నివారణకుగాను ఆయన చేసే పూజలు మరొక ఎత్తు.

దోష నివారణ పూజ చాలా ప్రత్యేకంగా ఉంటుంది. అందరికీ అది ప్రత్యేక ఆకర్షణ కూడా. దోషం ఉన్న వాళ్ళందరూ దూరం దూరంగా కూర్చొని ఉంటారు ఇసుకలో. ఎవరికి వాళ్ళు హారతి పళ్ళెంలో పసుపు కుంకుమ కలిపిన నీళ్ళు పోసి పెట్టుకుని, స్వామివారికోసం వేచి చూస్తుంటారు. స్వామీజీ శిష్య బృందంతో బాటు వచ్చి, అమ్మవారికి పూజ చేసి హారతి ఇస్తారు. కర్పూరపు సువాసనలతో ఆ ప్రాంతం అంతా ఘుమఘుమలాడుతూంటుంది. అటుపైన స్వామీజీ ఒక్కరొక్కరి దగ్గరికీ వస్తారు. ఎవరిముందున్న హారతి పళ్ళేన్ని వారి చుట్టూ త్రిప్పి దిష్టితీస్తారు. ఆ నీటిని వారి ఎదురుగానే ఇసుకలో పోస్తారు. స్వామీజీ శిష్యుడొకడు అగ్గిపుల్ల వెలిగించి ఆ నీళ్ళు పోసిన చోట

వేస్తాడు. మరుక్షణం అక్కడ మంటలు మండుతాయి!



స్వామీజీ సంతోషంగా నవ్వి, వారిని ప్రశంసిస్తారు. వాళ్ల దోషాలు, వాళ్ల శత్రువులెవరో చేసిన తంత్రాలు, రోగాలు, వాళ్లని పట్టిన దయ్యాలు-భూతాలు ఇవన్నీ ఆ మంటల్లో కాలి బూడిదైపోయినందుకు మెచ్చుకుంటారు. అటుపైన వాళ్లంతా ఆశ్రమానికి వాళ్ల దగ్గరున్న బంగారం, డబ్బు దానం చేస్తారు. కొంత మందినుండి ప్రత్యేకంగా మరింత సొమ్మును వసూలు చేస్తారు శిష్యులు.

కొంతమంది ముందు మంటలు రావు. అట్లాంటి వాళ్లని 'ఇంకా కొన్ని వారాలు ఇక్కడే నిద్ర చేయండి' అంటారు. అట్లా ఆ ప్రదేశం అంతా ఎప్పుడూ మనుషులతో కిటకిటలాడి పోతున్నది; ఒకరిని చూసి ఒకరుగా అందరూ వస్తున్నారు. స్థానిక పేపర్లలో స్వామీజీ ప్రత్యేక ప్రకటనలు ఇస్తున్నారు; పత్రికలవాళ్ళు ఆయన్ని కొనియాడుతూ ప్రత్యేకంగా రాస్తున్నారు. ఆ పత్రికలు ఉచితంగా ఇచ్చే క్యాలెండర్లలో స్వామివారి ముఖం వెలిగిపోతూ కనబడసాగింది.

***

శంకరయ్యది కూడా పొడరాళ్ళపల్లే- పిల్లల చదువుల కోసం పట్నంలో ఉంటున్నాడు. 'ఈ ప్రపంచంలో ఏది జరిగినా దానికి మనం కనుక్కోగల కారణం ఒకటి ఉండి తీరుతుంది' అని అతనికి చాలా నమ్మకం. అందుకనే శంకరయ్య "సైన్స్ ప్రచార వేదిక"లో సభ్యుడయ్యాడు. గ్రామాల్లో మూఢనమ్మకాలని పారద్రోలేందుకు కృషి చేస్తున్నాడు. 'మంత్రాలు, తంత్రాలు లేవు-

ఉన్నవన్నీ మ్యాజిక్కులే' అనే శంకరయ్య ఓ రోజు క్యాలెండర్లో స్వామీజీ ముఖం చూసి, "ఎవరో నాకు తెలిసిన వాడిమల్లేనే ఉన్నాడే; ఎవరబ్బా?!" అని తల గోక్కున్నాడు. కొంత సేపటికి గుర్తొచ్చింది- 'వీడిది ఆ ప్రక్క ఊరే. చదవటం కూడా రాని పదో తరగతి పిల్లలను ఫస్ట్ క్లాసులో పాసు చేయిస్తానని చెప్పి, వాళ్ల దగ్గర డబ్బులు వసూలు చేసి, ఎవరికీ కనబడకుండా పారిపోయిన 'చీటింగ్ చంద్రాగాడు' వీడు!' "అమ్మో! మళ్ళీ వేషం మార్చి, గారడీ నేర్చి, జనాలను మోసం చేస్తున్నావా? ఉండు, నీ బండారం బయట పెడతా!" అనుకున్నాడు శంకరయ్య.

***

దసరా సెలవుల సమయం. పొరుగు గ్రామం నుండి క్రొత్త సన్యాసి ఒకడు పాదయాత్ర చేసుకుంటూ పొడరాళ్ళపల్లి చేరుకున్నాడు. అతనితోబాటు పిల్ల శిష్యులూ వచ్చారు పదిమంది. వచ్చీ రాగానే శిష్యులందరూ తలా ఒక తట్టెడు ఇసుకనూ తీసుకొచ్చి వీధుల మధ్యలో పోసారు. "రండి! మీకు నచ్చినవాళ్లని తలుచుకోండి! మీ బోరులో నీళ్ళు ఒక గ్లాసెడు తెచ్చి ఈ ఇసుకలో పోయండి! అగ్గిపుల్ల గీసి పడేయండి! నీళ్ళెలా మండుతాయో చూడండి! అంతా మహాత్యం! అద్భుత శక్తి" అని అరుస్తూ తిరిగారు. ఇళ్ళలో వాళ్ళు అందరూ వీధుల్లోకొచ్చారు. ఇసుక కుప్పల మీద నీళ్ళుపోసి అగ్గి పుల్లతో వెలిగించారు. ఆశ్చర్యం! నీళ్ళు మండాయి!

అంతలో పాత స్వామి శిష్యులు కొందరు కొత్తస్వామిని కలిసారు. తమ ఆతిథ్యం స్వీకరించమని అభ్యర్థించారు. క్రొత్తస్వామి చిరునవ్వు నవ్వాడు. సరేనన్నాడు. తన శిష్యులతోబాటు వెళ్ళి పాతస్వామిని కలిసాడు. ఒక గంటకల్లా పాతస్వామి, క్రొత్తస్వామి కలిసి ప్రజలకు సందేశం ఇస్తారన్న వార్త వెలువడింది. ఆ రోజు సభలో పాతస్వామి దైవశక్తిని ప్రశంసిస్తూ ఉపన్యసించారు. క్రొత్తస్వామిని మెచ్చుకుని, మైకునందించారు.

క్రొత్తస్వామి స్టేజికెదురుగా ఉన్న ఇసుక కుప్పమీద నీళ్ళు చల్లారు. గ్రామంలోని

యువకుడొకడిని గబుక్కున రమ్మన్నాడు. ఆ కుప్పను కెలికి లోపల ఏముందో చూడమన్నాడు. వాడు వెతికి ప్రత్యేకంగా కనబడుతున్న ఓ రాయిని బయటికి తీసాడు. 'దాన్ని వాసన చూడు-' అన్నాడు క్రొత్తస్వామి. "ఇది కార్బైడు- మామిడిపళ్ళు, అరటిపళ్ళు మాగబెట్టేందుకు వాడే కార్బైడు ఇది!" అన్నాడు వాడు, నిర్ఘాంతపోతూ.



"దీనిమీద నీళ్ళు చల్లితే అసిటలిన్ గ్యాసు వస్తుంది. వెల్డింగువాళ్ళు వాడేది ఆ గ్యాసునే! ఇదిగో, ఇప్పుడు ఆ రాయిమీద ఇంకొన్ని నీళ్ళు పోసి, అంటించి చూడు- కావాలంటే" అన్నాడు క్రొత్తస్వామి.

పాతస్వామివారు, వారి శిష్యులు ఒక్కసారిగా లేచారు. "మోసం! దగా!" అని అరిచారు.

ఆలోగా కొందరు యువకులు కార్బైడుమీద నీళ్ళు పోసి మండించనే మండించారు. ఆ వెలుగులో క్రొత్తస్వామి తను పెట్టుకున్న పెట్టుడు గడ్డాన్ని తొలగించాడు. అతను మరెవరోకాదు; ఊరి వారందరికీ తెలిసిన శంకరయ్యే!

ఉగ్ర రూపంలో అతని మీదికి ఉరక బోతున్న పాతస్వామిని, శిష్యుల్ని అక్కడే మఫ్టీలో తిరుగుతున్న పోలీసులు పట్టుకున్నారు.

శంకరయ్య పదేళ్ళక్రితం పేపరును తెరచి పట్టుకొని ఊళ్ళోవాళ్ళందరికీ చూపించాడు- "గుర్తు పట్టలేదా, ఎవ్వరూ? చీటింగ్ చంద్రని?!" అడిగాడు.

గ్రామస్తులంతా ముక్కుమీద వేళ్ళు వేసుకున్నారు.

"ఔరా! ఒట్టికినే మనందరినీమళ్ళీ ఓ ఆటాడించేశాడే, వీడు!" అన్నారు.

"మనందరి పేర్లూ వాడికి ముందుగానే

తెలుసు! అందుకే మరి, అందరినీ చక్కగా పేరు పెట్టి పిలిచేసి గొర్రెల్ని చేసాడు" అన్నాడొక గ్రామస్తుడు పళ్ళు నూరుతూ.

"అసిటలిన్ గ్యాసుకు ఒక రకం వాసన ఉంటుంది. ఆ వాసన తెలియకుండా స్వామివారు కర్పూర హారతి ఇస్తారన్నమాట! తలలు ఊపే గొర్రెలు ఉన్నంతకాలం ఇట్లాంటి చీటింగ్ చంద్రులు ఉంటూనే ఉంటారు. మనందరం చదువుకోవలసింది అందుకే; మన మూఢనమ్మకాల్ని దూరం చేసుకునేటందుకే!" అన్నాడు శంకరయ్య.

కోపంతో ఉడికి పోతున్న గ్రామస్తుల బారినుండి చీటింగ్ చంద్రని, వాడి అనుచరుల్నీ కాపాడి పోలీసు జీపుకెక్కించటం పెద్ద పనే అయింది!



## చిట్టి పాటలు

### జామతోట

జామతోటకు పోయాను
జామ చెట్టూ చూసాను
జామ కాయా కోసాను
జామకాయా తిన్నాను
కిందకు నేను జారాను
అప్పుడూ ముల్లూ విరిగింది
అమ్మా నన్ను కొట్టింది
నాన్నా ముల్లూ తీసాడు

ఈ పాటల్ని మీరు ఇంటర్నెట్ లో http://kottapalli.in వద్ద వినచ్చు!

### అమ్మ నాకు తెచ్చింది బొమ్మ

గానం: గంగోత్రి, 4వ తరగతి.

అమ్మ నాకు తెచ్చింది బొమ్మా
చక్కనైనా రబ్బరి బొమ్మా

కొత్త గౌను తెచ్చి కుట్టినాను
దాని కళ్ళకు కాటుక పెట్టినాను
బుగ్గపై చుక్క పెట్టినాను
"అమ్మనాకు"
పాల బువ్వ కలిపి పెట్టినాను
అది తిన్ననంటే ఒక దెబ్బ వేసినాను
అది కూయి మంటే జోలపాట
పాడినాను
"అమ్మనాకు"

### చిన్ని చేప

గానం: రజిత, 4వ తరగతి, M.P.U.P.S, బద్దలాపురం.

చిన్న చిన్న చినుకురా
పెద్దవాన కురిసే రా
వాగు వంక పొంగె రా
చెరవులన్నీ నిండేరా
చెర చాప తేపేరా
చేపల్లన్ని పట్టెరా



# రాజకుమారుడి సౌందర్యం

*ఆంగ్లకథ*

*మూలం: దిహిందూ, ఏప్రియల్*10, 2012.   *అనువాదం: శ్రీ పి.వి.ప్రసాద్, విజయవాడ.*

అనగనగా ఒక యువరాజు. ఆ రాజు ఎంతసేపూ తన అందాన్ని చూచుకొని మురిసి పోతుండేవాడు; మైమరచి పోతుండేవాడు.

ఎవరైనా బాటసారులు రాజభవనానికి వస్తే "మీరెప్పుడైనా నా అంత సౌందర్యవంతుణ్ణి చూశారా?" అని వాళ్ళనడిగేవాడు. అందరూ 'లేదు'అనే చెప్పేవారు.

ఒకరోజు దర్శనాని కొచ్చిన ఓ బాట సారైతే "దేవుడు కూడా మీ అంత అందంగా వుంటాడని నేననుకోను...!" అంటూ అతిగా పొగిడాడు.

దాంతో పొంగిపోయిన యువరాజు "దేవతల కంటే కూడ నేనే సౌందర్య వంతుడినట.." అంటూ మరింత గొప్పగా చెప్పుకునేవాడు.

అలా రోజులు గడుస్తున్నాయి.

ఒకరోజు దేవదూతలమని చెప్పుకునేవాళ్ళు ఇద్దరు అతని దర్శనానికి వచ్చారు.

"మీరు చెప్పుకుంటున్నంత సౌందర్యవంతులో..కాదో.. చూద్దామని వచ్చాం" వివరించారు.

"ఏమని తేల్చుకున్నారు? నేను అత్యంత సౌందర్యవంతుడినా, కాదా!?" ఉత్సాహంగా అడిగాడు యువరాజు.

"మిమ్మల్ని ఈ రోజు ఉదయం నిద్రిస్తుండగా చూశాం. అప్పుడు ఇంకా అందంగా వున్నారు..." ఒక దేవ దూత చెప్పాడు.

"నా సౌందర్యం కొన్ని గంటల్లోనే ఎలా తగ్గిపోయింది?" అంటూ సేవకుల్ని పిలిచి "నేను ఉదయం ఇప్పటి కంటే ఎక్కువ అందంగా వున్నానా?" ఆరా తీసాడు యువరాజు.

"మీరు అప్పుడూ ఇప్పుడూ ఒకేలా వున్నారు ప్రభూ!" జవాబిచ్చారు సేవకులు.

"మేము దైవ స్వరూపలం. మీ సేవకులు చూడలేని వాటిని కూడా మేము చూడగలం. వాళ్ళ దృష్టి అసంపూర్ణం. కనుక వారు చెప్పింది నిజంకాదు. ఆ విషయం మీకు రుజువు చేస్తాం...." అంటూ ఒక దేవ దూత రాజుగార్ని ఒక పాత్రలో నీళ్ళు తెప్పించమని అడిగాడు.

రాజు వెంటనే ఒక పాత్రలో నీళ్ళు తెప్పించాడు.



దేవదూత సేవకుల్ని పిలిచి "పాత్రలోని నీటిని మీరు దగ్గరగా పరిశీలించండి. జాగ్రత్తగా గమనించండి. తరువాత గది బయటికి వెళ్ళండి" అని చెప్పాడు. సేవకులు పాత్రలోని నీటిని జాగ్రత్తగా పరిశీలించి, బయటికి

వెళ్ళారు.

అప్పుడు ఆ దేవ దూత పాత్రలోంచి ఒక అరచెంచా నీటిని తీసివేశాడు. మళ్ళా సేవకుల్ని లోపలికి పిలిచాడు- "పాత్రలోని నీటిలో ఏమైనా తేడా వుందా?" అడిగాడు.

"ఏమీ లేదు" జవాబిచ్చారు సేవకులు.



"పాత్రలో నీళ్ళు తగ్గినట్లు మీ సేవకులు గమనించ లేకపోయారు. మీ అందం తగ్గిన విషయం ఎలా గమనించలేదో ఇదీ అంతే..." రాజు గారితో చెప్పాడు దేవదూత.

ఆ మాటలకు రాజు కంపించిపోయాడు.

'నా అందం రోజు రోజుకీ తరిగిపోతోందన్న మాట! అంటే కొన్ని రోజులకు అది బాగా తగ్గిపోతుంది!

దాన్ని గురించి నేను ఇంత ఆరాట పడుతున్నానే, అయినా అది స్థిరంగా ఉండదన్నమాట! మరెలాగ?!'

అని ఆలోచనలో పడ్డాడు.

మెల్లగా అతనిలో జ్ఞానం ఉదయించింది. అద్దం అతన్ని ఆకర్షించటం మానేసింది.

నశించిపోయే భౌతిక సౌందర్యానికి గాక, అంత:సౌందర్యానికి, తన కర్తవ్యానికి ఎక్కువ ప్రాధాన్యత నివ్వాలని అతనికి అర్థమైంది.

కాలక్రమేణా అతను పూర్తిగా మార్పుచెందాడనీ, గొప్ప మానవత్వంగల రాజుగా ఎదిగి, అటుపైన రాజ్యాన్ని కూడా వదిలేసి విరాగి అయ్యాడనీ చెబుతారు.

# ఓం ప్రకాశ్ గుర్జర్

యువకెరటాలు



*ఒక్కొక్కసారి చాలా సామాన్యమైన నేపథ్యం నుంచి వచ్చిన వ్యక్తులు కేవలం తమ స్వయంకృషితో ఎదిగి ముందుకు పోతూ ఉంటే ఎంతో స్ఫూర్తివంతంగా అనిపిస్తుంది. ఇప్పుడు చెప్పబోయే కుర్రవాడి కథ అలాంటిదే. ఓం ప్రకాశ్ గుర్జార్- ఐదేళ్ళ వయసులో తల్లిదండ్రులకి దూరమయ్యాడు. ఆ తరువాత వ్యవసాయ కూలీగా మారాడు. ఇది* 1997-2000 *నాటి కథ.* 2006 *లో అదే ఓం ప్రకాశ్- అంతర్జాతీయ బాలల శాంతి బహుమతి అందుకున్నాడు. ఇంతలో అంత మార్పు ఎలా వచ్చింది?*

*నిర్వహణ: సౌమ్య, పుస్తకం డాట్ నెట్.*

ఒకసారి తన తల్లిదండ్రుల నుంచి దూరం అయ్యాక, బాల కార్మికుడిగా వ్యవసాయ పనులు చేయడం మొదలుపెట్టాడు ఓం ప్రకాశ్. పొలం దున్నడం, పశువులు కాయడం, విత్తు నాటడం, పురుగుల మందులు చల్లడం - ఒకటేమిటి అన్ని పనులూ చేసేవాడు. మరి ఇంతా చేస్తే, రెండు పూట్ల భోజనమే తప్ప, కనీసం కూలీ అన్నా ముట్టేది కాదు. పైగా ఏ చిన్న తప్పు చేసినా శిక్ష మాత్రం పెద్దదేనట. అలా మూడేళ్ళ పాటు కష్టాలు పడ్డాడు.

తరువాత, "బచ్పన్ బచావో ఆందోళన్" వారి కంటబడ్డాడు. "బచ్పన్ బచావో ఆందోళన్" అన్నది బాల కార్మిక వ్యవస్థను నిర్మూలించడానికి కంకణం కట్టుకున్న ఒక సంస్థ. 'కైలాష్ సత్యార్థి' అనే ఆయన స్థాపించారు దీన్ని. అలా వెలుగుబాట పట్టిన వారిలో ఓం ప్రకాశ్ గుర్జార్ ఒకడు. కూలి పనుల్లో ఉన్న పిల్లలకు తగిన ఆధారం కల్పించి, వాళ్లు బడిలో చేరి చదువుకునేలా చేస్తుంది యీ సంస్థ.

సహజంగా తెలివిగల కుర్రవాడైన ఓం ప్రకాశ్ స్కూల్లో చేరి, చక్కగా చదువుకున్నాడు, అంతే కాకుండా తమ సొంత ఊరిలో పిల్లలని చాలా మందిని స్కూలులో చేర్పించాడు. 'బాల ఆశ్రమ్'

వారి సహకారంతో తన ఊరిని "బాలమిత్ర" గ్రామంగా తీర్చిదిద్దాడు. బాలమిత్ర గ్రామాలుఏర్పడేందుకు కృషి చేసాడు. అలాంటి అనేక బాలమిత్ర గ్రామాల్ని కలిపేందుకు కృషి చేసాడు. పుట్టిన ప్రతి బిడ్డకీ జనన ధృవీకరణ పత్రం (బర్త్ సర్టిఫికేట్) ఉండాలని ప్రచారం చేశాడు. 'బాలల హక్కుల పరిరక్షణకు, వారి భద్రతకు ఈ చర్య మొదటి మెట్టు' అని అతని అభిప్రాయం.

ఓం ప్రకాశ్ కృషికి గుర్తింపుగా అతనికి 2006 లో అంతర్జాతీయ పిల్లల శాంతి బహుమతి లభించింది. ఒకప్పటి దక్షిణాఫ్రికా అధ్యక్షుడు, నోబెల్ శాంతి బహుమతి గ్రహీత- క్లార్క్ చేతుల మీదుగా అతను తన బహుమతిని అందుకున్నాడు. అవార్డు లభించే నాటికి ఓం ప్రకాశ్ తన తల్లిదండ్రుల్ని మళ్ళీ కలుసుకోగలిగాడు. అయినా వారి పేదరికం వల్ల, తిరిగి ఆశ్రమంలోనే ఉంటూవచ్చాడు. 'చదువుకోవడం పిల్లలకి ప్రాథమిక హక్కు' అని అతని విశ్వాసం. ఈ విషయమ్మై పిల్లలకి, పెద్దలకి అవగాహన కలిగించడం కోసం కృషి చేస్తున్నాడతను. ఇందుకోసం బాలకార్మికుడిగా తన అనుభవాల గురించి అందరికీ చెబుతూ, దాని వల్ల కలిగే పరిణామాల గురించి అవగాహన కలిగిస్తున్నాడట అతను. అతని చొరవ కారణంగా వాళ్ళ కుటుంబంలోని పిల్లలందరూ ఇప్పుడు స్కూల్లో చేరి చదువుకోవడం మొదలుపెట్టారు -కూలి పనులకి వెళ్ళడం మానేసారు.

ఓం ప్రకాశ్ లో మరొక కోణం కూడా ఉంది. అతనికి నాటకాల్లో నటించడం అన్నా, పాటలు పాడడం అన్నా, క్రికెట్ అన్నా కూడా ఇష్టమే. "క్రికెట్ ఫర్ పీస్" అన్న పేరుతో 'ఇండియా-పాకిస్తాన్' క్రికెట్ మ్యాచ్ ఒకటి జరిగితే, మనవాడు అందులో కూడా పాల్గొన్నాడు! 'పిల్లల చదువు-బాల కార్మిక వ్యవస్థ' గురించి జరిగిన అంతర్జాతీయ కాంగ్రెస్‌లో పాల్గొనడానికి ఒకసారి రాజస్థాన్ నుండి ఢిల్లీ దాకా- ముప్ఫై ఆరు గంటలు సైకిల్లో వెళ్ళాడట! కలెక్టర్ కావాలనీ, బాలల హక్కుల కోసం కృషిచేసి బాల కార్మిక వ్యవస్థ లేకుండా చేయాలనీ అతని ఆశయమట- నేను చదివిన ఈ వార్త మూడేళ్ళ నాటిది: అప్పటికి అతను ఇంకా ఇంటర్ చదువుతున్నాడు. బహుశ: కలెక్టర్ అయ్యే లక్ష్యం దిశగా అతను ముందుకు సాగుతూ ఉండి ఉంటాడు ప్రస్తుతం. 

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ : శ్రీమతి G.లలిత*, telugu4kids.com

ఈ బొమ్మను చూశారా, ఏం జంతువు, ఇది?



మేమే చెప్పేస్తాం..ఇదొక నక్క! కొంచెం జాగ్రత్తగా చూస్తే, ఇది అంత కులాసాగా దేన్ని చూస్తోందో తెలుస్తుంది మీకున్నూ.. దుబ్బుల రంగులో కలిసిపోయి ఒక పక్షి ఉంది.. కనబడిందా?

మరి ఈ నక్కకి, పక్షికి ఏం సంబంధం ఉందో, మరి? ఖచ్చితంగా ఏదో కథ ఉంది.. మీకు తెలుసేమో, మరి రాసి పంపించెయ్యండి! బాగున్న కథల్ని కొత్తపల్లిలో ప్రచురిద్దాం.

మా చిరునామా: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్- 515101. ఫోను: 08559240222. ఇ-మెయిలు: team@kottapalli.in

# పదరంగం-19

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ పోస్టు కార్డులో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-20 తో పాటు ప్రచురించగలం. నిర్వహణ: కొత్తపల్లి.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 |
| | | 5 | | | |
| 6 | 7 | | 8 | 9 | |
| | 10 | 11 | | | |
| 12 | | | | 13 | 14 |
| 15 | | | | | |

**అడ్డం:**

1. సెప్టెంబరు ఐదో తేదీన - జరుపుకుంటారు (6)
5. శిరస్సు (2)
6. వాడుక భాషలో రక్తపోటు (2)
8. వనం కాని వనం (3)
10. ఎర్రాఎర్రాని పండ్లు - 'ఎ' విటమిన్ ఉండే పండ్లు (4)
13. "పోక " చెక్కని ఇలా పిలుస్తారు(5)
15. చిగురు టాకులు 143562 (6)

**ఆధారాలు నిలువు:**

1. ముళ్ల చెట్టుకు కాసే అందమైన పువ్వు (3)
2. ఉగాది పచ్చడిలో చేసేది వేప___ (2)
3. తల్లులు పిలల్ని నిద్రపుచ్చేందుకు పాడేపాటా? (4)
4. నమస్కారం, మరోరకంగా(3)
7. దీన్ని వేసుకొని భోజనానికి కూర్చునేవాళ్లు(2)
9. 'వలు' అని రెండు సార్లంటే బట్టలు(4)
11. లోతులోంచి నీళ్లు తోడి పోసే యంత్రం(3)
12. నిలవ ఉండే నీళ్లకు ఇది పడుతుంది (2)
14. పిల్లలు ఎక్కువ ఏడ్చి పట్టేది తిరగబడింది (2)

పదరంగం 18కు సరైన జవాబు →

| | | | | | |
|---|---|---|---|---|---|
| | కో | | రు | వే | |
| జ | న | గ | ణ | మ | న |
| నా | | ణి | | న | గ |
| భా | ర | త | దే | శ | ము |
| | వా | ము | | త | |
| అ | ణా | | లో | కం | లో |

రాసిన వాళ్ళు:

1. పూజ, 5వ తరగతి, వికాసవిద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.
2. జి. తరుణి, 5వతరగతి, గడ్డంనాగేపల్లి, నార్పల.
3. పి.అనూష, 5వ తరగతి, శ్రీవిద్యారణ్య హైస్కూల్, అనంతపురం.
4. జి.సత్యలక్ష్మి, 2వతరగతి, ఇంటిబడి, చెన్నేకొత్తపల్లి.
5. కె.ప్రకాశ్, 4 వ తరగతి, మహేంద్ర అకాడమి, జహీరాబాద్.

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కింటికి: 20 రూ.
12 పుస్తకాలకై చందా: 240 రూ.

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.
బ్యాంకు అక్కౌంటు వివరాలు:
"Kottapalli Trust", A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**<u>ఈ నెలలో ఏపని-ఎవరిది?</u>**
ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు
సంపాదకత్వం: నారాయణ
వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి
ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు
ముఖచిత్రం 'ప్రకృతి': వీరాంజనేయులు
చిత్రాలు: అడవి, వినయ్, చంద్రకాంత్, సురేష్, విష్ణు, గౌరిశంకర్, ప్రసాద్, గోపాల్, గోపి.
కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**<u>ప్రత్యేక కృతజ్ఞతలు:</u>** రిషివ్యాలీ స్కూలు వారికి, అభ్యాసవిద్యాలయం వారికి, తేజ టాలెంటు స్కూలు వారికి, నందన గ్రామీణ పాఠశాల వారికి, ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాల బద్దలాపురం వారికి, శంకర శివరావు గారికి, 'విద్యార్థి' మాలతీకృష్ణగార్లకి, రాధా రాజశేఖర్ గార్లకి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచి పుస్తకం:

# గుర్రం గుడ్డు

## పరమానందయ్య శిష్యుల కథలు

ఓహ్! పరమానందయ్య శిష్యులు!

నవ్వుల పువ్వుల్ని వెదజల్లే అల్లరి పిల్లలు!

ఏ తెలుగువాళ్లకి తెలీదు, వీళ్లు?!

ఎటొచ్చీ వీళ్ల లీలల్ని నేరుగా చదవటం, అలా చదవటాన్నీ, రాయటాన్నీ సాధన చెయ్యటం, చేస్తూ చేస్తూ విరగబడి నవ్వటం - ఇదీ, కావలసింది!

దీన్ని మహత్తరంగా పోషించే చిన్ని పుస్తకం- "గుర్రంగుడ్డు"- దీన్ని సంకలనం చేసిపెట్టిన రెడ్డిరాఘవయ్య గారు, ప్రచురించి అందించిన బాలల అకాడమీ వారు- అందరికీ మనస్ఫూర్తిగా జై!




**గుర్రంగుడ్డు**

ప్రచురణ: ఆం.ప్ర.బాలల అకాడమి

పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాదు.

పేజీలు:68 వెల: రూ.5

# కథలెందుకు?

"ప్రపంచం అంతా పాడయిపోతోంది" బాధగా వొచ్చాడు వెంకటేశు.

"ఏమైంది?" అన్నా.

"ఇదిగో చూడు, దేశాలూ దేశాలూ వ్యాపారం పేరిట ఇట్లా కొట్టుకుంటున్నాయా, ఇంక యీ పాడు డబ్బుల కోసం మనదేశంలో ఎంత మంది నాయకులు ఎన్ని రకాలుగా గడ్డి మేస్తున్నారో చూడు! జనాలేమో ఆ మోసాల్నే ఒంట పట్టించుకొని, ఎవరు తమకు నాలుగు డబ్బులు ఇస్తే వాళ్ల ముందు క్యూకట్టి నిలబడుతున్నారు" అన్నాడు వెంకటేశు.

"నిజమే. అయితే ఏం చేద్దాం? అయినా ఆ జనాల్లో నువ్వూ- నేనూ కూడా ఒకళ్లం, తెలుసుగా?" అన్నాను నేను.

వెంకటేశు తెల్లబోయి చూశాడు.

"చూడు వెంకటేశూ, ఆత్మాభిమానం వొదిలేస్తే తప్ప ఎవరైనా ఇంకోళ్లకి దాసోహం కాలేరు. రానురాను మనందరిలోనూ ఆత్మాభిమానం పూర్తిగా చచ్చిపోతున్నదని నా అనుమానం.. ఏమంటావు?" అన్నాను నేను.

"నిజమే అనుకో, అయినా దీనిలోంచి బయటపడేదెట్లాగ? గొణిగాడు వెంకటేశు.

"బాగా చదవాలి. ఆలోచించాలి. ధైర్యం తెచ్చుకొని నచ్చిన పని చెయ్యాలి. ధైర్యానికి మన జీవితాల్లో తావివ్వాలి. మరీ ఎక్కువ సర్దుకుపోకూడదు. మంచి గురించి; నీతి-అవినీతి గురించి; నియమబద్ధంగా బ్రతకటం గురించి; విలువల్ని నిలుపుకోవటం గురించి మాట్లాడుతుండాలి. ఆత్మగౌరవాన్ని చేజారకుండా ఉంచుకునేదెలాగో చెబుతుండాలి మళ్లీ మళ్లీ. ఆ విలువలు ఎంతమందిలో నిలిస్తే- రానున్న కాలంలో లోకం అంత బాగుంటుంది."

"ఓహో! మళ్లీ కొత్తపల్లి పుస్తకాలలోకి వచ్చావా?" నవ్వాడు వెంకటేశు.

"అవును- మంచి ఆలోచనలు రేకెత్తించటానికి కథల్ని మించిన మాధ్యమాలు మరేమున్నాయి?" అన్నాను నేనూ నవ్వేస్తూ.

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP.
Ph:08559 240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada, Phone:08662579129